

అగ్నేర్వయం ప్రథమస్యామృతానాం
మనామహే చారు దేవస్య నామ ।
స నో మహ్యా అదితయే పునర్దాత్
పితరం చ దృశేయం మాతరం చ ॥

(ఋ 1.24.2)

ఎవడు మానవులు చేసిన శుభాశుభ కర్మలకు న్యాయరూప ఫల మిచ్చుటకు జన్మ జన్మాంతరములను కలిగించుచుండునో, ఎవడు అభ్యాస వైరాగ్యములతో సిద్ధిఁబొందిన ముక్త జీవులనుగూడ పరమానందమునుభవింప జేసి మహా ప్రళయానంతరము మరల ఈ దివ్య గుణయుక్త అఖండిత పృథివిమీద తల్లిదండ్రుల దర్శనము చేయించునో అట్టి సచ్చిదానంద స్వరూప సృష్టి స్థితి లయ కర్తయైన పరమేశ్వరుని గుణగాన మొనర్తుము రండు.

# జననీ - జన్మభూమి




కర్త :

డా॥ కోడూరి సుబ్బారావు

ప్రకాశకులు :

గాయత్రీ ఆశ్రమము (ట్రస్టు)

వ్యాసనగర్, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్.

గాయత్రీ గ్రంథమాల - 22

ప్రతులు : 2000

సృష్టి సంవత్సరము : 197, 29, 49, 093

దయానందాబ్దము : 168

అంగీరస, యుగాది, 1992

**మూల్యము . రు. 5-00**
(తపాలా వ్యయము అదనము)

ప్రతులకు :

1. గాయత్రీ ఆశ్రమము,
12-10-586/6, వ్యాస్‌నగర్,
సీతాఫలమండి, సికింద్రాబాద్-500 361.
2. వైదిక సాహిత్య భండార్,
ఆర్య సమాజము, సుల్తాన్ బజార్,
హైదరాబాద్ - 500 001.
3. శ్రీ మాశెట్టి వెంకటేశ్వరరావు,
3-3-738, స్వస్తిక్ మెటల్ ప్రొడక్ట్స్,
కంచరి బజార్, సికింద్రాబాద్ - 500 003
4. శ్రీ ఆర్ కృష్ణమూర్తి, బుక్ సెల్లర్,
ఆర్య సమాజ భవనము, సీతాఫలమండి.

ముద్రణ :

అమర్‌నాథ్ ప్రింటర్స్,

సీతాఫలమండి, సికింద్రాబాద్.

# శ్రద్ధాంజలి

## నిరాడంబర దేశభక్తుడు, ధర్మాభిమాని



## కీ. శే. డా॥ వఠ్యం వెంకటేశ్వర ప్రసాద్

**(Dr V. V. Prasad, Homoeo Skin Specialist)**

జననము : 19-7-1927 మరణము : 13-12-1991

పరిచయము : వీరు మచిలీపట్టణము (బచ్చుపేట) లో జన్మించి నట్లు చెప్పగా నేను (డా॥ కోడూరి సుబ్బారావును) వింటిని. దాదాపు ఇరవై సంవత్సరముల క్రితము మా దయానంద హోమియో వైద్యశాల

అంతర్గతముగా వైద్యసేవతోపాటు హోమియో వైద్య ప్రచారము కూడా చేస్తూ ఉండేవారము. తమ్ముడు ఇచ్చుటతో అందరికి అందుబాటులో ఉండే దేవుడిచ్చిన యీ వైద్య విధానమును విస్తృతపరచవలె నను ఉద్దేశ్యముతో 'జైసూర్య స్మారక సంఘము' వారి సహకారముతో హోమియో తరగతులు నిర్వహించి రిజిస్ట్రేషన్ పరీక్షలకు పంపిస్తూ ఉండేవారము. తరగతులతోపాటు వైద్య ఉపన్యాసములు, ప్రశ్నోత్తర వేదికలు, రిపర్టరీ ద్వారా మందు నిర్ణయ విధానము మొదలగు కార్యక్రమములు ప్రతినెల నిర్వహిస్తూ ఉండేవారము. ఆ సందర్భములో డా॥ ప్రసాద్‌గారు రెండు మూడు ఉపన్యాసములు వినుటకు వచ్చుట జరిగినది. అప్పుడు నాకు వారితో పరిచయము లేదు. తదుపరి ఒకసారి ఒక పనిమీద బర్కత్‌పురాలో వారి చికిత్సాలయము ముందు నుండి వెళ్ళుచున్న నన్ను గుర్తించి, వారే పలుకరించి, పరిచయము చేసుకొనుట జరిగినది కొద్దిసేపు వార్తాలాపముతోనే ఒకరి భావముల నొకరము అర్థము చేసికొంటిమి. అప్పటినుండి వారితో నాకు సన్నిహిత సంబంధ మేర్పడినది. తరచుగా కలిసికొనుటయు, వారిని నేను కొన్ని సందేహ ములు అడిగి తెలిసికొనుటయు జరుగుచుండెడిది.

కష్టజీవి : వారు మొదట గుడివాడ హోమియో కళాశాలలో చాలాకాలము పనిజేసి తరువాత మార్పు జరిగి యిచ్చట జయసూర్య హోమియో కళాశాలకు వచ్చిరి. కొంతకాలము తదుపరి కళాశాలనుండి పద్మారావునగర్ గవర్నమెంటు హోమియో డిస్పెన్సరీకి మారుట జరిగినది. వీరు ఏ పనిలోనైన చాలా నిజాయితీపరులు. గవర్నమెంటు డిస్పెన్సరీలో కూడా రోగులకు తమ స్వంత చికిత్సాలయములో మాదిరిగానే చికిత్స చేస్తూ యుండేవారు. ప్రారంభమునుండి ప్రజావర జకు నోచుకోని ఆ డిస్పెన్సరీ వీరి రాకతో రోగుల సంఖ్య గణనీయ ముగా పెరిగి సమయమే చాలకుండెడిది. మధ్యాహ్నము ఒక గంట

విశ్రాంతి కూడా దొరకుట కష్టమయ్యేడిది. సాయంత్రము డిస్పెన్సరీ కూడా ముగించుకొని యింటికివెళ్ళి నిలబడే కొంత అల్పాహారము సేవించి వేగంపేటలోని భజన బ్రహ్మచారి ఆశ్రమము వారిచే నడుప బడే ఉచిత హోమియో చికిత్సాలయములో వైద్యసేవ జేయుటకు వెళ్లేడివారు. ఆశ్రమము నుంచి ఏమాత్రము గౌరవ వేతనము తీసుకొనేడి వారు కారు. వీరి నిస్వార్థ సేవకు యేదో రూపములో ప్రతిఫలము అందించాలని ఒక మోటారు సైకిలు ఆశ్రమము వారు కొనియిచ్చిరి. ఆ ఉచిత వైద్యశాలలో కూడా నిజాయితీగా వైద్యసేవ జేసి రాత్రి యేడు గంటల ప్రాంతములో బర్కత్‌పురాలోని వారి స్వంత చికిత్సాలయానికి వస్తూ ఉండేవారు. అప్పటికి ఎంతోమంది రోగులు వీరి రాకకు యెదురు చూస్తూ ఉండేవారు. అయినప్పటికి ప్రతి రోగిని తృప్తిగా చూసి మందు యిచ్చేవారు. సరియైన అవగాహన కలిగేవరకు ఎంతమంది రోగులు వేచి ఉన్నా పరీక్ష చేయనిది తొందరపడి మందు యిచ్చేవారు కారు. అప్పటినుంచి రాత్రి పన్నెండు దాటేవరకు (ఒక్కొక్కసారి రెండింటి వరకు) కూడా వైద్యసేవ జేసి యింటికి వెళ్లేవారు అప్పుడు యేమి తినేవారో, యెన్నిగంటలు నిద్రించేవారో తెలియదు. మరల ఉదయం 8 గం॥కు చికిత్సాలయములో హాజరయ్యేవారు. ఇది నిత్య కార్య క్రమము కాగా శనివారము రాత్రి గుంటూరు వెళ్ళి ఆదివారము రోజంతా చికిత్సాలయము నడిపి రాత్రికి బయలుదేరి సోమవారము ఇక్కడి చికిత్సాలయమునకు హాజరయ్యేడివారు. తరువాత నెలకు ఒకటి రెండు సార్లు విశాఖపట్టణము, వరంగల్ కూడా వెళ్ళి వస్తూండేవారు గుండె ఆపరేషన్ తరువాత కూడా అంతటి పరిశ్రమ జేయుచుండుట నాకు చాలా ఆశ్చర్యము కలిగించెడిది. ఆపరేషను కాక పూర్వము (రెండు సంవత్సరముల క్రిందటి వరకు) గంటల తరబడి నిలబడియే రోగులకు చికిత్స చేస్తుండేవారు. అంతటి తీవ్ర వత్తిడి పనులందియు నా

కోరిక మేరకు మధ్యాహ్నము మిగిలే ఒకటి రెండు గంటల విశ్రాంతి సమయములోను నా వద్దకు వస్తూ ఉండేవారు. మేము వారి మెటీరియా మెడికా ఉపన్యాసములు రికార్డు చేస్తూ ఉండేవారము.

విలక్షణ వైద్యులు : వీరి చికిత్సాపద్ధతి విలక్షణంగా ఉండేది. చాలా కొద్దిమందులతో, చిన్న పొటెన్సీలతో, కొద్దిమోతాదులతోనే బలీయమైన దీర్ఘరోగములకు చికిత్స చేయుచుండెడివారు. సామాన్యముగా అందరు అనుసరించుపద్ధతిగాక క్రొత్తపద్ధతిగా వారి చికిత్స ఉండేది. మెటీరియా మెడికాకు వారు చెప్పే వ్యాఖ్యానముకూడా క్రొత్తగా ఉండేది. ఎందరో సీనియరు వైద్యుల భావాలను అందుకోగలిగిన నాకు వీరి భావాలు అంతుపట్టేవి గావు. కాని ప్రత్యక్షముగా గనబడే రోగనివారణలు చూచి వారనుసరించే పద్ధతిలో యేదో విశిష్టత ఉందని అనిపించేది. కొన్ని సంవత్సరములకు పూర్వము "రామకృష్ణా హోమియో స్టోర్స్" ప్రాంగణములో కొందరు సీనియరు వైద్యులు 'హోమియోపథ్స్' అను పేరుతో ఒక పాలీక్లినిక్ నడిపిరి. అందులో వీరుకూడా ఒకరు. అందు వీరి వంతుగా చర్మవ్యాధుల విభాగము వచ్చినది. చర్మవ్యాధులకు చికిత్సచేయుట ముఖ్యముగా ఎలర్జీలకు చికిత్సచేయుట చాలా కష్టమైనపని. వీరా విభాగమును సంతోషముతో స్వీకరించి కష్టపడి వాటిని గూర్చి అధ్యయనము జేసి సమర్థవంతముగా చర్మవ్యాధుల నివారణ చేస్తూ ఉండేవారు. అప్పటినుండి వీరికి "హోమియో స్కిన్ స్పెషలిస్టు" అను ముద్రపడినది. కొంతకాలము తదుపరి ఆ పాలీక్లినిక్ మూసివేయుట, వీరి చికిత్సాలయమే చర్మవ్యాధుల చికిత్సాలయముగా మారిపోవుట జరిగినది. కుష్ఠు, బొల్లి, తామర మొదలగు దీర్ఘవ్యాధులతో పాటు అతి సంక్లిష్టమైన "ఎలర్జిక్ డెర్మటైటిస్" వ్యాధినికూడా అద్భుతముగా నివారణ చేస్తూ ఉండేవారు. కేవలము చర్మరోగాలేగాక అన్నిరకముల

దీర్ఘవ్యాధుల రోగులు వీరివల్ల లాభము పొందుచుండెడివారు. వీరి యీ చికిత్సా పద్ధతిని తోటి హోమియో వైద్యులలో కూడా ప్రచారము చేసి విస్తృత పరచాలని నా కుండెడిది. అందరకు అనుకూలముగా ఉండే విధముగా రెండవ శనివారమురోజు వీరిచే రెండు మూడు ఉపన్యాసములు యిప్పించితిని. నా కోరిక మేరకు నోట్సుకూడా తయారుచేసి యిచ్చిరి. దానివలన యెందరు ప్రయోజనము పొందిరో కాని నేను కొంత ప్రయోజనము పొందితిని. కాలేజీలో కాకుండా యీ విధముగా బయట వైద్యులముందు తమ భావాలను వ్యక్తపరచే అవకాశము నేను కల్పించినందున వారికి నాపై కృతజ్ఞతాభావ ముండెడిది. మరికొన్ని ఉపన్యాసములు యేర్పాటు చేయవలెనని యెంత ప్రయత్నించినా వారికి, నాకు తీరికదొరికెడిది కాదు. వారి చికిత్సా పద్ధతిని పుస్తక రూపములో తీసుకురావలెనని నేను యెంతో వత్తిడి చేస్తూ ఉండెడి వాడిని. ఆ ప్రయత్నముగానే ఒక మంచి టేపురికార్డరు కొని మధ్యా హ్నము దొరికే ఒకగంట తీరిక సమయములో నా గదిలో ఉపన్యాస ములు రికార్డుచేస్తూ ఉండేవారము. అదికూడా కొంతకాలమే సాగినది. తదుపరి పనిభారము పెరిగి యిద్దరికి తీరికే లేకపోయినది.

<u>దేశ భక్తుడు</u>: వీరికి చిన్ననాటినుండియు సామాజిక సేవ యందు, దేశ సేవయందు ప్రీతి మెండు. రాష్ట్రీయ స్వయం సేవక సంఘము ద్వారా అజ్ఞాతముగా ఎంతో సేవజేస్తు ఉండేవారు. ఉదారముగా యెంతోదానము చేస్తూ ఉండేవారు. అయిదారు సంవత్సరము లకు పూర్వము ఒక R.S.S దేశభక్తుడు (పేరు గుర్తులేదు) చనిపోయి నపుడు వీరు స్వంత తండ్రి చనిపోయినట్లు బాధపడిరి. కొంతకాలము చికిత్సాలయమునకు కూడా పోలేదు.

దానశీలి : నేను మా వ్యాస్ వైదిక సేవా సమాజములో ఒక గది నిర్మించుకున్నప్పుడు ఆ విషయము చెప్పుటకు వారివద్దకు వెళ్ళితిని వారు చాలా సంతోషించిరి. అక్కడ మీకు యేయే అవసరములున్న వని అడిగిరి. అన్నియు ఉన్నవనియు, అందరి సహకారము ఉన్న దనియు తెలిపితిని. అయినను ప్రతి ఒక్క విషయము అడిగి తెలిసి కొనుచు మా సమాజములో మంచినీటి కుళాయి లేదని గుర్తించిరి. 'మంచినీరు మీకు, సమాజానికి కూడా అవసర'మని వారే బలవంతముగా మంచినీటి కుళాయి కొఱకు ప్రయత్నము చేయుమని చెప్పిరి. అందుకు అవసరమైన ధనము దానముగా నొసగిరి. ఆ రోజులలో నీటివత్తిడిలేక భూమిలో గోతులుత్రవ్వి నీరు పట్టుకొనెడివారము. నాకు ఆ బాధకూడా కలుగకుండుటకు చిన్న నీటిపంపుకూడా కొనియిచ్చిరి. తదుపరి, మా సమాజ భవననిర్మాణము ప్రారంభించినపుడు వారికి తెలుపగా అందుకు అవసరమైన 50 బస్తాల సిమెంటు (4 వేల రూపాయల మూల్యము) దానముగా యిచ్చిరి. ఒక కళ్యాణ మండపము నిర్మించ సంకల్ప మున్నదని చెప్పగా 'నేనే మొదటి దాతగా ఉంటాను. ప్రారంభము చేయు'మని మమ్ము ప్రోత్సహించిరి. కాని, అది సాకారము చెందకుండానే వారు దివంగతులగుట మా దురదృష్టము. ఎవరినైనా పేద రోగులను పంపిన ఉచితముగా చికిత్సచేస్తూ ఉండేవారు. ఇవన్నియు వారి దాతృత్వమునకు కొన్ని ప్రతీకలు మాత్రమే.

స్వదేశీ వస్తు ప్రేమి : వీరిలో నాకు నచ్చిన మరొక విశిష్ట గుణమున్నది. వీరికి స్వదేశీవస్తువులపై ప్రీతి మెండు. దేశభక్తునిగా అది అవసరమని వారి వాదన. మేము ఒక చేపురికార్డరు కొనవలసి వచ్చినపుడు విదేశాలవి చాలా బాగుంటాయని యెంత చెప్పినా వారు వినిపించుకోలేదు. 'ధర యెక్కువైనా, నాణ్యతలో కొంత లోపమున్నా

స్వదేశీవస్తువులే కొనాలి. మన దేశపు డబ్బు మన దేశములోనే ఉండాలి' అని గట్టిగా వాదించేవారు. ఈ విషయములో నేనే ఓడిపోయాను వారే గెలిచారు. చివరకు టేపురికార్డరునేగాక క్యాసెట్లను కూడా మన దేశములో తయారైనవే కొనిపించారు. వారి పట్టుదల, స్వదేశీవస్తు ప్రేమ నన్ను ఎంతో ముగ్ధుణ్ణి చేశాయి.

శ్రద్ధాంజలి : ఊహించని విధముగా ఒకరోజు "ఈనాడు" దిన పత్రిక చదువుచు డా॥ ప్రసాద్‌గారి మరణవార్త చదివితిని. నేను నమ్మలేకపోతిని. రెండు రోజుల ముందే వారిని నేను కలుసుకొని యుంటిని. అప్పటికి వారికెట్టి అనారోగ్యము లేదు. ఎట్లు చనిపోయిరో అర్థము కాలేదు. వెంటనే బాగ్‌లింగంపల్లి లోని వారి గృహమునకు వెళ్ళితిని. గుండెపోటుతో మరణించినట్లు వారి సతీమణి ధృవీకరించగా నమ్మక తప్పలేదు. ఒక మంచివైద్యుని, ఒక సంఘ సేవాభిలాషిని, ఒక ఆదర్శ దేశభక్తుని కోల్పోయినందుకు చాలా బాధపడితిని. విధిబలీయము. వారికి కృతి నెట్లు అంకితమివ్వగలను? అందుచేతనే వారికి యిది

నా శ్రద్ధాంజలి.

డా॥ కోడూరి సుబ్బారావు

# సంపాదకీయము

మానవునకు జననీ జనకులను సేవించుట కర్తవ్యమైనట్లు జన్మభూమిని కూడా సేవించుట పరమ ధర్మమని వేదములు భూసూక్తము ద్వారా ఆదేశించుచున్నవి. అనేకమంది మహనీయులు తమ జన్మభూమి కొరకై తమ నిండు ప్రాణములను ఆహుతిగా నిచ్చినారు. మానవునకు మృత్యువు భయంకరమైనది గాదు. మరణము అవసరమైనట్లు మనము వృద్ధాప్యముతో బాధపడునపుడు, దీర్ఘవ్యాధులు ఆవరించబడియున్నప్పుడు కోరుకొందుము. మరణము తర్వాత తిరిగి జన్మ లభిస్తుందనెడు విశ్వాసము మనకు గలదు. కాని అధర్మము, విద్యుక్త ధర్మమును నెరవేర్చక పోవుట, అన్యాయ అక్రమ పద్ధతులను అవలంబించుట అత్యంత భయంకరమైనవి. ఇవి మనలను జన్మ జన్మలలో బాధించును.

శ్రీరాముడు జన్మభూమి ముందు స్వర్గము కూడా వెలవెల పోవునని చెప్పిన విషయము విదితము. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి'. ఈ విషయములను చక్కగా సులభశైలిలో డాక్టర్ కోడూరి సుబ్బారావు గారు యీ పుస్తకములో వివరించినారు. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు వారిచే ప్రచురించబడిన వైదిక సాహిత్య పుస్తకములలో ఇది 21వది. పాఠకులు దీనిని చదివిచూచి జన్మభూమి పట్ల కొంతమందైనా కర్తవ్యోన్ముఖులు కాగలరని ఆశించుచున్నాము.

ఈ పుస్తకమును అచ్చు వేయుటలో సహకరించిన దాతలకు, ప్రూఫ్‌రీడర్లకు, కంపోజిటర్లకు, అమర్‌నాథ్ ప్రింటింగ్ ప్రెస్ యజమానులు శ్రీ పాండు గారికి, పనివారలకు మా కృతజ్ఞతలు.

టి. సూర్యనారాయణ
కార్యదర్శి, గాయత్రీ ఆశ్రమ ట్రస్టు

# జననీ - జన్మభూమి

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి"

"జన్మ నిచ్చిన తల్లి, జన్మించి పెరిగి పెద్దవారమైన దేశము స్వర్గము (మిక్కిలి సుఖసాధన సంపన్నమైన దేశము) కన్నను అన్ని విధముల గొప్పవి" అని మర్యాదా పురుషోత్తమ శ్రీరామచంద్రుని ఉపదేశము.

తన అనన్య ఆర్య క్షత్రియ పరాక్రమముతో దుష్టరావణ సంహారముచేసి ధర్మాత్ముడైన అతని తమ్ముని (విభీషణుని) ఆ రాజ్యమునకు పట్టాభిషిక్తుని గావించి రమ్మని శ్రీరాముడు తన తమ్ముడైన లక్ష్మణుని లంకానగరమునకు పంపెను. తన విజయార్జితము స్వార్థము కొరకు గాని, ప్రతిష్ఠా కాంక్ష కొరకుగాని, రాజ్య విస్తీర్ణకాంక్ష కొరకు గాని కాదని దీనివలన ఋజువగుచున్నది. అరణ్యవాస దీక్షలో నుండుటచే నగరములోనికి తాను పోకుండా తన తమ్ముని పంపెను. అపురూప భోగ భాగ్యములతో స్వర్ణ పూతలతో తళ తళ మెరయు విలాస మందిరములతో కూడిన లంకా నగర వైభవముగాంచి లక్ష్మణుడు ఆశ్చర్య మొందెను. తిరిగి వచ్చి ఆ స్మృతులను శ్రీరామునకు వివరించుచుండగా శ్రీరాముడు వారించుచు

శ్లో॥ మమే న రోచ్యంతే స్వర్ణమయీ లంకా పశ్య సౌమ్య ।
జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి ॥

ఓ లక్ష్మణా! నీవు కీర్తించు లంకా నగర వైభవ ప్రశంస నాకు రుచింపకున్నది. ప్రతి వ్యక్తి తన తల్లిని, తను పుట్టి పెరిగిన జన్మభూమిని స్వర్గము కన్న మిన్నగా నెంచవలెను — అని ఉపదేశించినట్లు పెద్దలు చెప్పుదురు.

శ్రీరామచంద్రుని పై మాటలలోని ఔచిత్యమేమో మనము వైజ్ఞానిక దృష్టికోణముతో పరిశీలింతము. ముందుగా జననిని గూర్చి ఆలోచింతము.

# జనని

మన శరీరములు తల్లి దండ్రుల రజో వీర్యమువలన యేర్పడునని అందరెరిగిన విషయమే. మన శరీరములందు 100 కి 99 భాగములు తల్లివలననే యేర్పడును. పురుష వీర్యములో లక్షలాది, కోట్లాది వీర్యాణువులున్నను అందు ఏదో ఒక్కటి మాత్రమే స్త్రీలోని పక్వము జెందిన అండములో ప్రవేశించి దానిని ఫలదీకరించును తదుపరి పురుష వీర్యముతో పిండమునకు పనిలేదు. ఆ వీర్య కణము కూడా అన్ని కణములవలె సంపూర్ణమైనదికాదు. అది ఒక అర్థ కణము మాత్రమే. ఏలయన మన శరీరములోని వివిధ రక్త, మాంస, అస్థ్యాది కణములన్నియు 23 ఒంటరి క్రోమోజోములను కలిగి యుండును. స్త్రీ అండములో కూడా 23 ఒంటరి క్రోమోజోములే యుండును. ఫలదీకరణ సమయమున ఆ విడివిడి క్రోమోజములు జతలుగా కలిసిపోయి ఒక సంపూర్ణ కణముగా మారిపోవును. ఆ ఫలదీకరణ కణమే వృద్ధి జెందుచు పిండముగా - బిడ్డగా మారును. ఆ ఉభయుల క్రోమోజోములు తయారు కాబోవు బిడ్డలో తల్లి దండ్రు లిరువురి వంశపారంపర్య లక్షణములను తీసికొనివచ్చును.

ఫలదీకరణ జరిగిన అండము స్త్రీ గర్భ కోశమునుజేరి అక్కడ స్థిరపడి క్రమముగా వృద్ధి జెందును. తల్లి రక్తము వలన పోషింప బడుచు వివిధ అంగ ప్రత్యంగములతో పూర్ణ శిశువుగా తయారగును. జన్మించి ప్రపంచములోని ఆహారపదార్థములు జీర్ణము చేసుకొనగలవరకు తల్లి పాలే ఆ శిశువునకు ఆహార మగును. ఆ పాలే శిశువులోని వివిధ ధాతువులను పెంచి పోషించు చుండును. మన శరీరములోని ఎముకలు తల్లి ఎముకలలోని కాల్షియంనుండి తయారగును. కండరములు కండరములనుండి, నాడులు నాడులనుండి, హృదయము హృదయము నుండి తయారగును. అందు చేతనే ఋషులు "అంగా దంగాత్ సంభవసి హృదయా దధి జాయసే। (గోభిలాయన గృ. సూ 2-8, 21-22) అనియు, "మాతా నిర్మాతా భవతి" యనియు వర్ణించిరి.

ఆమె శరీర నిర్మాత్రియేగాక సూక్ష్మ శరీరమైన మన మనో నిర్మాత్రి కూడా. గర్భిణీ స్త్రీని అయిదవ మాసమునుండి "దౌహృద" యని సంబోధింతురు. దౌహృద యనగా 'రెండు హృదయములు గలది' అని అర్థము. తన గుండెతోపాటు తన గర్భములో పెరుగు బిడ్డ హృదయము కలసి రెండు హృదయము లగును. బిడ్డ హృదయ స్పందనలు తల్లి హృదయ స్పందనలతో కలిసి తల్లి నాడి యందు గోచరించునట్లు బిడ్డ మనసు తల్లి మనసుతో కలిసి ఆమె కోరికలందు, భావనలయందు చివరకు ఆమెకు కలుగు స్వప్నములయందు బిడ్డ మనో ఛాయలు గోచరించు చుండును. తన మన స్తత్వానికి భిన్నమైన భావనలను బిడ్డవిగా గుర్తించి వివేకవతియైన తల్లి వాటిని సంస్కరించ ప్రయత్నించును. సద్గ్రంథ పఠనముతో, సత్సాంగత్యముతో, బలమైన ఆదర్శ భావనలతో తన శక్తి కొలది బిడ్డను సంస్కరించ ప్రయత్నించును. ఉదాహరణకు — తన లోపల పెరుగు బిడ్డ పిరికివాడు, భయస్తుడు

అయిన తన మనస్తత్వానికి భిన్నముగా కలుగుచున్న భయాందోళనలను లోపల పెరుగు బిడ్డవిగా గుర్తించి ధైర్య సాహస గాథలు చదువుచు, అటువంటి భావనలతో తన మనస్సును సమాధాన పరచుకొనుచు ఆ పిరికి భావనలను సంస్కరింప ప్రయత్నించును. బలమైన శిక్షిత మనస్సు బలహీనమైన మనస్సుపై తన ప్రభావము చూపు నను సమ్మోహన సిద్ధాంతము యిచ్చట వర్తించును. కనుక సంస్కారవంతురాలైన తల్లి తన బిడ్డ శరీర నిర్మాత్రియే గాక మనో నిర్మాత్రికూడా యగును భారతీయ సంస్కృతిలోని 16 సంస్కారములలో 3 వ సంస్కారమైన సీమంతోన్నయనము ఇందు కొరకే నిర్దేశింపబడినది. *

తల్లి మన శరీర మనో నిర్మాత్రియే గాక మన కొరకు ఎన్నెన్నో త్యాగములు జేయును. గర్భావస్థ యందే ఎన్నో యిబ్బందులకు గురియగును. వేవిళ్ళతో ప్రారంభించి ప్రసవించు వరకు యీ బాధలు పలు విధములుగా నుండును. వాంతులతో ఆహార హితవుతప్పి చిక్కి శల్యమగును. గర్భము పెరుగు కొలది కడుపులో ఎక్కువ భాగము ఆక్రమించుట వలన మల మూత్రావరోధములతో, కాళ్ళకు రక్త ప్రసారము తగ్గి కాళ్ళ వాపులతో, గుండె ఊపిరి తిత్తులకు ఒత్తిడి కలిగి ఆయాసముతో, పడుకొనుటలో యిబ్బంది కలిగి నిద్ర సరిగా పట్టక పోవుటతో, శరీర ధాతువులనుండి సారము రక్తముగా పిండమునకు చేరు చుండుటవలన బలహీనతతో బాధపడును. ఇనుము, కాల్షియం మొదలగు లోహ లవణాదులను గోల్పోయి తన ధాతు శక్తియే

* ఈ విషయము వివరముగా తెలుసుకొనగోరు వారు నాచే రచింపబడిన 'వైదిక వైజ్ఞానిక సంస్కృతి 1, 2 భాగములు చదువ గోరెదను.

తగ్గి పోవుచుండగా మనసైన ఎన్నెన్నో ఆశలతో ఆ బాధలన్నిటిని విసిగి వేసారక తృప్తితో అనుభవించును.

లోపల పెరుగు బిడ్డ ఆరోగ్యము కొరకు తన కోరికలను చంపుకొని తాపసిక జీవనము గడుపును. ఇవేగాక, కొందరు తల్లులు ఎంత వింత బాధల ననుభవింతురు. ఆ బాధలకు పరిష్కారము ఆధునిక వైద్యులకే అంతుపట్టక ప్రసవించు వరకు అనుభవింపక తప్పదందురు. గర్భావస్థలో నేడు బహుళ ప్రచారములోనున్న క్రిమిసంహారకములు (Antibiotics) వాడిన బిడ్డకు అవయవ లోపములు కలుగునను భయముతో జ్వరము, తలనొప్పి మొదలగు బాధలకు మందులు వాడక సహనముతో అనుభవించును. కృత్రిమ నవనాగరిక జీవనమునకు అలవాటుపడి పాలు పండ్ల రసాదులు సహించకున్నను బిడ్డ ధాతువృద్ధికొరకు వాటిని తృప్తిగా సేవించును. గర్భస్రావము కలుగగలదను భయముతో కొన్ని ప్రయాణములను, కొన్ని వినోద ప్రదర్శనలను వదలి పెట్టును. తన ఆరోగ్యము కొరకు అంతగా శ్రద్ధ వహించని తల్లికూడా బిడ్డ కొరకు వివిధ వైద్య పరీక్షలు చేయించు కొనును. రోగ నిరోధక టీకాలు మొదలగు వాటిని వేయించుకొనును.

ఇక ప్రసవ సమయమున ఆ తల్లి అనుభవించు వేదన పెరిగి పెద్దవారై తాము ప్రసవించు సమయమున ఆడు బిడ్డలు అర్థము చేసుకొందురేగాని పురుషులు అర్థము చేసుకొనలేరు. నేటి కృత్రిమ జీవన విధానము వలన ప్రసవము భయంకరమై పునర్జన్మగానే గోచరించు చున్నది. కల్ల నొప్పులతో, అసలు నొప్పులతో యెంతగానో బాధపడి చివరకు వైద్య సహాయముతో ప్రసవించును. కొందరికి కొన్ని కుట్లు పడగా, కొందరికి పటకారులు (Foreceps) అవసరము కాగా, మరి కొందరికి పెద్ద ఆపరేషనే (Scisarian) అవసర మగుచున్నది.

కొందరు రక్తము అధికముగా గోల్పోయి ధాతు శక్తినే గోల్పోవు చున్నారు.

ఇక బిడ్డ భూమిమీద పడినా ఆ తల్లి బాధలు తీరిపోవు తాను బలహీనముగా నున్నను బిడ్డ ఆలన పాలన కొరకు సమయమునకు పాలు పట్టుచు, మల మూత్రాదులను శుభ్రము జేయుచు, అవసరమైనపుడు మందులను త్రాగిస్తూ రాత్రింబవళ్లు నిద్రాహారములు లెక్కచేయక సేవలు చేయును. బిడ్డకు అజీర్ణాది రోగములు రాకుండుటకు కఠిన పథ్యము చేయును. బిడ్డకు కొద్ది అనారోగ్యము కలిగినను ఆందోళనతో వైద్యుల వద్దకు పరుగులెత్తును. ధనములేకున్న అప్పులు చేయును. బిడ్డకు ప్రాకుట వచ్చినప్పటినుండి యెక్కడ యే ప్రమాదము జరుగునో యని యేపని జేయుచున్నను బిడ్డపైననే ధ్యాస నుంచును. నడక వచ్చినప్పటినుండి పడిపోవునేమోయని ఆందోళన జెందుచుండును ఎంత అల్లరి చేసినా, ఎన్ని వస్తువులు పాడుచేసినా, కోపముతో తనను కొట్టినా సహించును.

బిడ్డకు బడికిపోవు వయసు వచ్చి కొంత శ్రమ తగ్గినా బిడ్డ యింటికి వచ్చువరకు మనసు బిడ్డపైననే యుంచును. నేటి బరువు బడి చదువులను (ఆర్థిక బరువులను, పుస్తకముల బరువులను కూడా) మోసి చదివించును. పెద్ద చదువుల కొరకు అప్పులు చేయును. అవసరమైన తన నగలను కుదువ పెట్టును. ఇట్లెన్నో త్యాగములు చేసిన జనని ప్రేమముందు స్వర్గము........ఏ పాటిది ? శ్రీరాముని మాటలలో అతిశయోక్తి యేమి గలదు ?

మానవుని జ్ఞానము నైమిత్తికము అనగా కొన్ని కారణములవల్ల వృద్ధి జెందినదే కాని శరీరముతోపాటు పెరుగునదికాదు. విశేష జ్ఞానమే గాక సామాన్య జీవన నిర్వహణ జ్ఞానముకూడ నైమిత్తికముగనే

కలుగును. ఈ విషయము కొన్ని ఉదాహరణల ద్వారా విశదమగును. ఆవుదూడ జన్మించిన కొన్ని నిమిషములలోనే నడువగలుగును. పాలు కుడుచుకొన గలుగును. గడ్డి పరకలు నమిలి నెమరువేయ గలుగును. చేప పిల్ల జన్మించిన వెంటనే ఈద గలుగును. అట్లే పశు పక్ష్యాదులలో వాటి జీవన నిర్వహణ కవసరమగు జ్ఞానము జన్మతోనే లభించును. ఈ జ్ఞానమును స్వాభావిక జ్ఞానమందురు. ఈ స్వాభావిక జ్ఞానము మనుష్యులందు కానరాదు. వారికి అవి యన్నియు అనగా త్రాగుట, తినుట, కూర్చుండుట, నడచుట మొదలగు పనులన్నియు ఎవరైనా నేర్పవలయును.

ఇక విశేష జ్ఞానమైన మాట్లాడుట, చదువుట, వ్రాయుట, ఆలోచించుట మొదలగునవికూడ యితరులు నేర్పుటవలన లేదా యితరుల ననుకరించుటవలన నేర్చుకొన గలడు. ఈ జ్ఞాన గ్రహణమంతయు బుద్ధియను అంతరింద్రియము ద్వారా జరుగును. బుద్ధి యనగా జ్ఞాన గ్రహణశక్తి. ఇది నైమిత్తికముగ అనగా ఇతరులనుండి వారు బోధించుటవలన వికసించునే కాని శరీరముతోబాటు వికసించదు. ఆ నైమిత్తిక కారణములలో ప్రధానమైనవి మూడు. అవి యేవనగా తల్లి, తండ్రి, ఆచార్యుడు. దీనినే ఋషులు ఒక సూత్రము ద్వారా వివరించిరి. "మాతృమాన్, పితృమాన్, ఆచార్యవాన్ పురుషో వేద". అనగా తల్లి, తండ్రి, ఆచార్యుని వలన పురుషుడు (మానవుడు) జ్ఞానవంతు డగును. ఆ ముగ్గురిలోను తల్లిది ప్రథమ స్థానము. ఆమెయే మనకు త్రాగుట, తినుట, కూర్చుండుట, మాట్లాడుట, స్నానాదులు చేయుట మొదలగునవి నేర్పును. తాను విద్యావతియైన అక్షరములను నేర్పి చదువుట నేర్పును. ఉచ్చారణ దోషములను సరిదిద్ది కొన్ని నీతి శ్లోకములను, వేద మంత్రములను

నేర్పును. చిన్న చిన్న కథలతో నీతులను బోధించును. ఇంత చేసిన తల్లిని ప్రథమ గురువుగానే గాక గొప్ప గురువుగా మనువు ఎట్లు వర్ణించెనో వినుడు—

శ్లో॥ ఉపాధ్యాయాన్ దశాచార్య
ఆచార్యాణాం శతం పితా ।
సహస్రం తు పితౄన్ మాతా
గౌరవేణాతిరిచ్యతే ॥ (మను. 2-145)

పదిమంది ఉపాధ్యాయులకంటె ఒక ఆచార్యుడు, నూరుమంది ఆచార్యులకంటె తండ్రియు, ఒకవేయి తండ్రులకంటె తల్లియును గొప్పవారు. అనగా ఇట్లొకరికంటె నొకరు అధికముగా గౌరవించ దగినవారు.

ఇక వ్యాసుడు మహా భారతమున "నాస్తి మాతృ సమో గురుః"
(మ.భా. శాంతి పర్వము 342-18)

తల్లితో సమానమైన గురువు లేదనియు, "మాతా గురుతరా భూమే" (మ.భా. వన 313-60) గౌరవమునందు తల్లి భూమి కన్నను గురుతరమైనదనియు వర్ణించెను.

## ప్రథమ దేవత

ఋషులు తల్లిని ప్రథమ దేవతగా పేర్కొనిరి. దేవత యనగా దివ్య గుణములు గలది అని అర్థము. అనగా తన శారీరక, మానసిక, ఆర్థిక శక్తులను యితరుల ప్రయోజనమునకై వినియోగించుట. ఆ దృష్టితో చూచిన తల్లి మన కొరకు తన సర్వస్వము నర్పించిన అప్తురాలు. అందుచేత ఆమె మనకు మొదటి దేవత.

ఇక పరమేశ్వరవాణియైన వేదము మరొక మెట్టు పైకెక్కి- తల్లిని ప్రథమ దేవతగానే గాక పరమేశ్వరునితో సమాన మనును. అట్లు ప్రార్థన చేయుమనును.

వస్యాం ఇంద్రాసి మే పితరుత భ్రాతు రభుంజతః।
మాతా చ మే ఛదయథః సమా వసో వసుత్వనాయ రాధసే॥
(ఋ. 8-1-6)

ఓ ఇంద్రా ! పరమేశ్వరా ! నీవు నన్ను పాలించు తండ్రి కన్నను, పాలించని అన్నదమ్ముల కన్నను గొప్పవాడవు. కాని నా తల్లితో పోల్చి చూచిన నీవు ఆమెకు సమానుడవుగానే కనిపించు చున్నావు. ఏలయన మీరిద్దరు నాకు శరీరము నిచ్చి- ఆశ్రయము నిచ్చి ఆదరించితిరి. ధనైశ్వర్యాదుల నిచ్చి నా ఉన్నతిని కోరుచున్నారు. కాన మీ యిద్దరిలో భేదమేమున్నది ?

ఎంత గొప్ప భావన ! పరమేశ్వరుడే స్వయముగా తల్లికి తనతో సమాన స్థాన మిచ్చెను గదా ! అందు చేతనే తల్లిని ప్రత్యక్ష దైవముగా వర్ణించుటయు అచ్చటచ్చట కనబడును. కనబడని దేవుని దర్శించి (తెలిసికొని) సేవించే యోగ్యత మనకు లేకపోయినా అతనితో సమానమైన కన్న తల్లిని కన్నులారా దర్శించి సేవించు అవకాశము మనందరికి గలదు. గాన ఆ తల్లి సేవా శుశ్రూషలు చేయుదుము రండు.

## పితృ దేవో భవ

ఇచట మరొక విషయము స్పష్టపరచవలసి యున్నది. తల్లి విలువను శ్లాఘించినంత మాత్రమున తండ్రిని ఉపేక్షించినట్లుగాని,

ఉపేక్షించవలెనని చెప్పినట్లుగాని కాదు. తండ్రి నుపేక్షించి తల్లి సేవా శుశ్రూషలు, ఆదర సత్కారములు చేసినంత మాత్రమున ఏ తల్లి సంతసించును ? అట్లు చేసిన 'పతినే ప్రత్యక్ష దైవము'గా భావించు ఆ తల్లి మనస్సెంత క్షోభించును ? భార్యా భర్తలుగా తల్లి దండ్రులు రెండు అర్ధ శరీరములు కలసి ఒకటి అయినట్లు ఒకటిగానే యుందురు. తండ్రి చేసిన త్యాగము మాత్రము యేమంత తక్కువది ? వంశోద్ధారకుల కోసము ఆ తండ్రి ఎంతో తపించును. గర్భిణిగానున్న తల్లిని పువ్వులలో పెట్టి పూజించును. భర్త ఆదరణలోనే, పాలన పోషణలలోనే తల్లి నిశ్చింతగా, ప్రసన్నముగా తన గర్భములో మన శరీర మనో నిర్మాణములకై కృషి చేయును. భూమి మీద పడిన మనను లాలించి పోషించును. తండ్రి కూడా తల్లికి సహకరించుచు మన జ్ఞాన విజ్ఞానములకు కారణ మగును. సభ్యతా సంస్కృతులను నేర్పును. అందుచేతనే ఋషులు జ్ఞానదాతలలో తల్లి వెనువెంటనే తండ్రిని పేర్కొనుచు "మాతృమాన్, పితృమాన్, ఆచార్యవాన్ పురుషో వేద" అని చెప్పిరి. తల్లి వలెనే మనః ఉన్నతికి సర్వస్వము అర్పించ సంసిద్ధుడగు తండ్రిని కూడా దేవత యని "మాతృదేవో భవ" వెను వెంటనే "పితృదేవో భవ"అని ఉపదేశించిరి. తండ్రికి చేయు ఆదర సత్కారములే తల్లికి సంతృప్తిని కలిగించును. తద్వారా అవి ఆమెకు చేయు సత్కారములే యగును. మన శరీర మనో నిర్మాణములలో, జ్ఞానదాతలలో తల్లికి ప్రథమ స్థానము, తండ్రికి ద్వితీయ స్థానము కలదనుటయే ఈ రచన ఉద్దేశ్యము

## కర్తవ్యము

ఇట్టి ప్రత్యక్ష దేవతలైన తల్లిదండ్రులపట్ల మన కర్తవ్యము చాలా ఉన్నది. ప్రతి నిత్యము వారి సేవా శుశ్రూషలు చేయవలెను.

ఈ సేవలనే మన మహర్షులు "పితృ యజ్ఞము" పేరుతో పంచ మహా యజ్ఞములలో నొకటిగా చేర్చిరి. ప్రతి నిత్యము ఉదయము ప్రాతః స్మరణము తదుపరి లేదా సంధ్యాగ్ని హోత్రముల తదుపరి తల్లి దండ్రులకు పాదాభివందనము జేసి వారి ప్రసన్నతను, ఆశీర్వాదమును పొందవలయును. అది మనకు దినమంతయు ఎంతో మేలు జేయును. మహర్షి మనువు యీ అభివాదన మహిమను శ్లాఘించుచు యిట్లు చెప్పెను—

అభివాదన శీలస్య నిత్యం వృద్ధోప సేవినః
చత్వారి తస్య వర్ధంతే ఆయుర్విద్యాయశో బలమ్ ॥

(మను. 2-121)

నిత్యము వృద్ధులైన తల్లిదండ్రులకు పాదాభివందనము జేసిన ఆయువు, విద్య, యశస్సు (కీర్తి), బలము వృద్ధి జెందు చుండును.

వారి ఆశీర్వాదములు, ప్రసన్నతా వాక్కులే మనలో సద్భావనను, సదాచారమును, ధార్మిక ప్రవృత్తిని కలిగించును. తద్వారా పై నాలుగు సంపదలు లభించును.

ఇంతేగాక - ప్రతి వ్యక్తి తనను కని పెంచిన తలి దండ్రులకు ధార్మికముగా ఋణపడి యుండును. ఈ ఋణమును గుర్తు జేయుటకు ఋషులు మూడు ప్రోగుల యజ్ఞోపవీతమును నిర్మించి అందు మొదటి ప్రోగును తల్లిదండ్రుల ఋణమునకు గుర్తుగా నిర్దేశించిరి. ఇది మన యెడమ భుజముపై వ్రేలాడుచు మనను ఋణ విముక్తికై కృషిజేయుమని సదా గుర్తు జేయుచుండును. దీనిని విస్మరించిన ఋణగ్రస్తుడై దుఃఖముల పాలగును. ఈ జన్మలో కాకున్నను రాబోవు జన్మలలోనైన ఆ పాపఫల మనుభవింపక తప్పదు. గాన ప్రతి నిత్యము తల్లి దండ్రులకు శ్రాద్ధ తర్పణముల నాచరించవలెను.

శ్రాద్ధ తర్పణములకు లోకములో విపరీతార్థములు గలవు. చనిపోయిన తండ్రి, తాత, ముత్తాతలకు; తల్లి, అమ్మమ్మ, ముత్తమ్మమ్మలకు పిండప్రదానాదు లొనర్చుట యని వింత అర్థములు చేసి అమాయకులచే పౌరాణిక పురోహితులు తద్దినాదులు పెట్టింతురు. *పితర' శబ్దము బ్రతికియున్న వారికే గాని చనిపోయిన వారికి వర్తించదు. చనిపోయిన వారిని ప్రేత లందురు. అట్టి ప్రేతలకు మనము చేయ వలసినది, చేయగలిగినది యేమియు లేదు. జీవుడు వదలి వెళ్లిన శరీరము భస్మము చేయుటతో అంతమగు (భస్మాంతగ్ం శరీరం. యజు. 40-15) నని వేదము చెప్పుచున్నది. తదుపరి పరమేశ్వరుడు జీవుని అతని కర్మానుసారము మరొక ప్రాణిగా జన్మింపజేయ వ్యవస్థ జేయును. అప్పుడు వారి ఆకలి దప్పులకు అహార పానీయాదుల వ్యవస్థ కూడా పరమేశ్వరుడే చేయును. అంతేగాని మనము సంవత్సరమున కొకసారి పెట్టెడు గుప్పెడు పిండి ముద్దలకు అఱ్ఱులు చాచుచు నరకమున బడియుందరు. శ్రాద్ధ మనగా బ్రతికి యున్నవారికి శ్రద్ధతో జేయు సేవా శుశ్రూషలు. తర్పణ మనగా వారిని భోజన, వస్త్రా దులతోను, అనుకూల వర్తనముతోను తృప్తిపరచుట. కనుక తల్లి దండ్రులు బ్రతికి యున్నప్పుడే పై విధముగా శ్రాద్ధ తర్పణము లొనర్చి ఋణవిముక్తులము కావలెను.

ఎన్నెన్నో త్యాగములు జేసిన జనని ఋణము యెంత జేసినను తీరనిదే. అయినను మన శక్తి కొలది ఆమె ఋణమును తీర్చుకొన మనసా, వాచా, కర్మణా ప్రయత్నించవలెను. ఊహ వచ్చినప్పటినుండి ఆ ప్రయత్నము మొదలుపెట్టి యింటి పనులలో చేదోడు వాదోడుగా నుండాలి. ఆమె మనసు కష్టపెట్టకుండా ఆమె మాట వినుచు, ఆమెకు నచ్చిన విధముగా నడచుకొనుచు ఆమెకు తృప్తిని, ఆనందాన్ని

కలిగించాలి. ఆమె యెంత ప్రసన్నురాలైతే అంతగా మనకు మేలు జేకూడును. నీకు విజయము లభిస్తే యెక్కువగా సంతసించేది నీ తల్లే. నీవు ఏ చిన్న బాధకు గురియైనా ఎక్కువగా బాధపడేది నీ తల్లే.

ఆ తల్లిని నోరార మన మాతృ భాషలో 'అమ్మా'యని పిలిచిన యెంత తృప్తిగా నుండును. కాని నేడు ఆంగ్లభాషా వ్యామోహములో ఆ పదమును వదలి 'మమ్మీ'యని పిలుచుట దురదృష్టకరము. మమ్మీ పదములోని మూలార్థము చాలా సంకుచితముగా నుండును. స్తనములు గలది, స్తన్య మిచ్చినది యని యీ పదమున కర్థము. కాని అమ్మ పదము సంస్కృతము నుండి వచ్చినది. సంస్కృతములో మాతా పదము గలదు. దాని అర్థము ముందే వివరముగా తెలిసికొని యుంటిమి. మన శరీర మనో నిర్మాత్రియైన తల్లిగా ఆ పదము ధ్వనించుచున్నది. ఆ పదముతో 'అ' యను ఉపసర్గ జేరి అమ్మగా మారినది. 'అ' యనగా "సమంతాత్"- సమగ్ర నిర్మాతయని ఆ పదమున కర్థము. ఇంతటి మహత్వ పూర్ణ పదమును వదలి విదేశీయులకు అమ్ముడు పోవుట బుద్ధిమంతులవని గాదు. అమ్మ పదము మీకు పాతదిగా తోచినచో 'మాతాశ్రీ' యని పిలవండి. బి.ఆర్ మహాభారత ప్రభావముతో ఉత్తరదేశమున యీ పదము బహుళ ప్రచారము జెందినది. ఈ పదములో ఎంతో గంభీరమైన అర్థమున్నది. ఎంతో గౌరవభావ మున్నది. కాని 'అమ్మ'లో ఉన్నంత ఆప్యాయతలేదు. ఆలోచించి మీ కేది అనుకూలముగా నున్న అట్లు పిలవండి. మమ్మీ పదము వదిలిపెట్ట ప్రయత్నము చేయండి.

తల్లిదండ్రులపట్ల పుత్రుల కర్తవ్యమును వేదము ఒక వాక్యము ద్వారా చక్కగా వివరించును. "అనువ్రతః పితుః పుత్రో- మాత్రా భవతు సమ్మనాః" (అథర్వ 3-30-2) పుత్రుడు తండ్రికి అనువ్రతుడు

కావలెను. తల్లివంటి మనస్సు కలవాడు కావలెను యని యీ వాక్యమున నర్థము. అనువ్రతు డనగా తండ్రి జేయు వ్రతములను అనగా మంచి పనులను తా ననుసరించి ఆ వంశ కీర్తిని కాపాడుట. ఉదాహరణకు తండ్రి దాన శీలుడైతే తాను దాన శీలుడు, ధర్మ ప్రియుడైతే ధర్మ ప్రియుడు కావాలి. ఆర్తత్రాతయైన యితరుల భయమును పోగొట్టి అండగా నిలవాలి. దాని వలన అతనికి ఉన్నతి కలుగుటయే గాక పరంపరగా వచ్చుచున్న ఆ వంశ కీర్తి కాపాడబడును. ఇక తల్లితో సమాన మనస్కు డన తల్లికి పుత్రుని పట్ల యెంతటి ప్రేమ భావన, ఆత్మీయత, మమకారము ఉండునో; అతని కొరకు ఎంతటి త్యాగమైన జేయుటకు సిద్ధపడి యుండునో అట్లే పుత్రుడు కూడా తనను ఆమె శరీరాంశముగానే భావించి తన శరీరము పట్ల యెంతటి శ్రద్ధాసక్తులు కలిగి యుండునో అట్టి భావనతో తల్లికి సేవ జేయవలెను. ఇచ్చట పుత్ర శబ్దము వచ్చినంత మాత్రమున యీ బాధ్యత పుత్రికలకు లేదని కాదు. ఈ పదము పుత్రికా పుత్రుల కిరువురికి వర్తించును. కనుక పుత్రికలు కూడా తల్లి దండ్రులను సేవించి వారి ఋణ విముక్తులు కావలెను.

ప్రాచీన యితిహాసమును పరిశీలించిన మాతృభక్తి, పితృభక్తి కలిగిన వారెందరో మన భారత దేశమున నుండెడి వారని విశద మగును. అందు ముఖ్యముగా రామాయణ కాలము నాటి శ్రవణ కుమారుడు ధృవతారవలె నేటికిని ప్రకాశించు చున్నాడు. పేద వైశ్య బాలకుడైన శ్రవణ కుమారుడు అంధత్వము కూడా ప్రాప్తించిన వండు, వృద్ధులైన తల్లిదండ్రు లిరువురకు అత్యంత శ్రద్ధా భక్తులతో సేవ జేయుచుండెడివాడు. వారి ప్రతి కోరిక తీర్చుటకు శక్తి కొలది శ్రమించెడివాడు. కాల క్రమమున తల్లి దండ్రులకు తీర్థ యాత్రలు జేయవలెనను కోరిక గలిగెను. పేదవాడగుట చేతను, ఆ వాడు

ప్రయాణ సాధనము లెక్కువగా లేనందున తాను ఒక కావడిని తయారు చేసుకొనెను అందు రెండు వైపుల రెండు గంపలు పెట్టి ఇరుప్రక్కల వారి వృద్ధ తల్లిదండ్రులను కూర్చుండబెట్టుకొని తానే స్వయముగా మోసికొనుచు అరణ్య మార్గమున తీర్థ యాత్రలు సాగించెను. రైళ్ళు కాలినడకనుండుటచే ఒకరు స్థిరముండక అరణ్యములో దొరకు కంద మూలములనే ఆహారముగా తల్లిదండ్రులచే సేవింపజేసి తాను కూడా వాటినే భుజించు చుండెను. అట్లు పయనించుచు క్రమముగా అయోధ్య నగర పరిసర వనములను జేరుకొనెను. ఆ రాత్రి తల్లిదండ్రులకు దాహ మయ్యెను. వారి దప్పికను తీర్చుటకు కమండలమును చేతబూని నీరు తెచ్చుటకై సరయూ నదిని జేరుకొనెను. పాత్రను శుభ్రముజేసి అందు నీరు పట్టు చుండెను. నీరు పట్టు నప్పుడు 'బుడ బుడ' శబ్దము జేయుచు నీరు నిండు చుండెను.

అప్పటికి అయోధ్యను దశరథ మహారాజు పరిపాలించు చుండెను. ఆ రాజు మృగయా వినోద వ్యసనముతో ఆ అడవికి వేటకు వచ్చెను. వేటలో యేనుగులను చంపరాదను నియమ ముండెడిది. యుద్ధములో శత్రువుల యేనుగును మాత్రమే చంపెడివారు. మరే పరిస్థితులకోను యేనుగును చంపెడివారు కారు. కాని దశరథ మహా రాజు వ్యసన కారణముననో లేక మరే కారణముననో నీటిలో కలుగు చున్న ఆ 'బుడ బుడ' శబ్దములను విని యేదో అడవి యేనుగు నదిలో నీరు త్రాగుచున్నదని పొరబడి 'శబ్ద భేది' బాణమును ప్రయోగించెను. అది శ్రవణ కుమారుని గుండెకు తగిలెను. విపరీతమైన బాధతో అతడు నేలపైబడి మూలుగు చుండెను. ఏనుగు కొరకు వచ్చుచున్న రాజు మనిషి మూలుగు విని పొరపడితినని పశ్చాత్తాపము జెందుచు అతనిని సమీపించెను. శ్రవణ కుమారుని ద్వారా వృత్తాంతమంతయు విని చేయరాని మహా పాపము జేసితినని తీవ్రవ్యథ జెందు చుండెను. "ముందు యీ నీరు తీసుకొని నా తల్లిదండ్రులకిమ్ము. వారు దాహముచే

తపించుచున్నారు. వారి దాహము తీరిన తరువాతనే వారికి నా మరణ వార్తను తెలుపవలయునని శ్రవణ కుమారుడు రాజును కోరెను.

అహో ! శ్రవణ కుమారుని మాతా పితృభక్తి యెంత మహోన్నతమైనది ! అందుచేతనే నేటికిని అతనిని స్మరించుచున్నాము. శ్రీ రాముని పితృభక్తి, భీష్మని పితృభక్తి మీ అందరకు తెలిసినదే కదా !

అటువంటి సద్భావన కలుగుటకు పరమేశ్వరుని ప్రార్థింతము రందు—

ఓం యదా పిపేష మా తరం పుత్రః ప్రముదితో ధయన్ !
 ఏతత్ తదగ్నే! అనృణో భవామ్యహతౌ పితరౌ మయా
 సంవృచస్థ సం మా భద్రేణ పృఙ్క్త వి వృచస్థ
 వి మా పాప్మనా పృఙ్క్త ॥ (యజు 19-11)

హే అగ్నే! ప్రకాశ స్వరూప పరమేశ్వరా ! మాతృ దుగ్ధమును గ్రోలుచు ఆనంద యుక్తుడనైన నేను తల్లి రక్త సారమునే పానము చేసితిననియు, మల మూత్రములతో ఆమె ఒడిని మలినము చేసి అనేక విధముల పీడించితిననియు నేటికి గ్రహించితిని. తల్లిదండ్రు లిరువురి ఋణము ఎంత సేవ చేసినను తీరనిదే. అయినను నా శక్తి కొలది ప్రయత్నించి ఆ మహా ఋణము నుండి విముక్తుని గావించుకొన ప్రయత్నింతును గాక ! వారు నన్ను లాలించినట్లే వారిని సేవింతును గాక ! హే పరమేశ్వర ! (భద్రేణ సంపృఙ్క్త) సద్గుణములతో సంయుక్తుని జేయుము. నీవు అంతర్యామివై పాపములనుండి కుసంస్కారముల నుండి కాపాడు వాడవు గాన నన్ను ఈ మాతా పితరుల ఋణ విముక్తిని బొంద ప్రేరేపించుము. ఋణ విముక్తుడనై ఈ జన్మలోను, పర జన్మలలోను సుఖములను బొందుదును గాక !

**మాతృ దేవో విజయతామ్**

# జన్మభూమి

పై ప్రకరణమును చదివిన వివేకవంతులైన పాఠకులకు జనని విలువ తెలిసియే యుండును. ఇక జన్మభూమి విలువ తెలియవలె నన్న మరికొంత సూక్ష్మముగ నాలోచించవలసి యుండును. జనని మన శరీర నిర్మాత్రి యైనటులే జన్మభూమి కూడ మన శరీర నిర్మాత్రియే. మన శరీరములోని ఇనుము, సున్నము, భాస్వరము మొదలైన లోహ లవణములన్నియు కొన్ని మార్పులతో వృక్షముల ద్వారా భూమి నుండి లభించినవియే. భూమిలోని లోహ లవణములను (Inorganic Salts) వృక్షములు సేంద్రియ లవణములు (Organic Salt) గా మార్చి మన కందించును. వాటిని సేవించి మన శరీరములు పెరిగి పెద్దవగును. తల్లి రస రక్తాదులే బిడ్డ రస రక్తాదులై బిడ్డ ఆమె శరీరాంశమైనటులే మనము పుట్టి పెరిగిన భూమాత సారమే మన శరీరాంశ మగుటవలన ఆమెకు మనము పుత్రుల మనుటలో అతిశయోక్తి ఏమి గలదు ? ఈ విషయమే వేదము చాలా చక్కగా వివరించును.

"మాతా భూమిః పుత్రోఽహం పృథివ్యాః" అథర్వ (12-1-22)

ఓ భూమాతా ! నీవు నాకు తల్లివి, నేను నీకు పుత్రుడను.

-పుత్రికను

మన శరీరములే కాదు మన మనుభవించు ప్రతి భోగ్యవస్తువు భూమినుండి జనించినదే. నివసించు గృహారామ విలాస మందిరములు; భుజించు సమస్త భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యములు; సేవించు దుగ్ధ, దధి, రసాదులు ; ధరించు సువర్ణ రజితాది ఆభరణములు, మణి మాణిక్యాది సమస్త రత్నములు, చీని చీనాంబరాది సమస్త దుస్తువులు;

పేదవాడు మొదలుకొని అత్యంత భాగ్యవంతుని వరకు ఉపయోగించు గృహోపకరణాది వస్తువులు అన్నియు భూమినుండి జనించినవే. ఇవన్నియు రూపాంతరము జెందిన పృథివియే.

అయితే అల్పజ్ఞుడు, అల్పశక్తిమంతుడునైన మానవుడు తాను నివసించుచున్న భూఖండమునే (రాజ్యమునే) జన్మభూమిగా తలంచును. ఇదియును ఒక అంశమున యథార్థమే పృథివి ఎంత విశాలమైనను తన శరీరము తన రాష్ట్ర పృథివి సంపదతోనే పెరిగి పెద్దదైనది. తన రాజువలన, తన రాష్ట్ర ప్రజల వలన పాలింపబడి పోషించబడెను తన రాష్ట్ర అతిథి, ఆచార్యుల వలన తాను జ్ఞానవంతు డయ్యెను. తన రాష్ట్ర సంస్కృతితో సంస్కార వంతుడు, వివేక వంతుడు అయ్యెను. తన రాష్ట్ర నదీ నదముల, సెలయేళ్ల జలములను గ్రోలుచు పక్షుల కిలకిలా రావములలో, గోధూళిలో పరవశించి ఆటలాడు కొనుచు బాల్యమును గడిపినది ఈ రాష్ట్రమునందే. అందుచే తన కుటుంబముతో మమకార బంధ మేర్పడినట్లే ఈ రాష్ట్రమున గల సంపదలతోను మమకార బంధ మేర్పడుట సహజమే. అది అవసరము కూడా. తాను విశాల ప్రపంచములోని మానవుడైనా తన కుటుంబము పట్ల తనకు కొన్ని బాధ్యతలున్నట్లే తన రాష్ట్రముపట్ల ప్రతి వ్యక్తికి కొన్ని బాధ్యత లుండును. తన ఉన్నతికి రాష్ట్రము, రాష్ట్ర ఉన్నతికి తాను కారణమగుటయు జరుగును.

విజయ కాంక్షగల తనను ప్రోత్సహించునది తన రాష్ట్ర ప్రజలే. విదేశీయులు కారు. జీవన పోరాటములో మనము విదేశీయుల నాశ్ర యించినను, విదేశీయులు మన కాశ్రయ మిచ్చినను ఆపదలో మనను మన మాతృ భూమియే తన అక్కున జేర్చుకొని ఆదరించును.

అత్యంత భోగ భాగ్యములతో అతి విలాస జీవితమును గడుపు అభివృద్ధి జెందిన దేశములైనను మన మాతృభూమి ఆదరణ ముందు అవి ఏ పాటివి? స్వర్గము కన్నను జన్మభూమి గొప్పదను శ్రీరాముని మాటలలో అతిశయోక్తి ఏమున్నది? ఇంతకుమించి భారతావని మన జన్మభూమి యగుట మన పూర్వజన్మల సుకృత ఫలము. ఈ మాటలును అతిశయోక్తులు కావు. చరిత్రను పరిశీలించిన మీకే అవగతము కాగలదు. తెలిసికొన గోరిన చదువుడు.

## ధరిత్రీమాత మన భారతమాత

ప్రపంచ చరిత్రను పరిశీలించిన ఏ దేశములోను ఉద్భవించనంత ఎక్కువగా ఋషులు, మహర్షులు, త్యాగులు, వీరులు, వీర వనితలు, విద్వాంసులు, విజ్ఞానవేత్తలు, ఆదర్శపురుషులు ఈ దేశములో ఉద్భవించిరి. అట్లని విదేశములలో విద్వాంసులు, వీరులు, ఆదర్శ పురుషులు జన్మింప లేదని అర్థము కాదు. ప్రపంచ చరిత్రలో అక్కడక్కడ అట్టి సుగుణ సంపన్నులు కలరు. కాని వారిని మన చారిత్రక పురుషులతో పోల్చిన గణనకే రాకుందురు.

అన్నిటిని మించి ఇచట ఉద్భవించిన విద్యా సంపద, శీల సంపద, సర్వోత్కృష్టములు. అందుచేతనే ఆది ప్రపంచ చక్రవర్తి యైన మను మహారాజు—

శ్లో॥ ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్ర జన్మనః ।
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వ మానవాః॥
(మను. 2-20)

"ఓ ప్రపంచ మానవులారా! ఈ భారతదేశమున జన్మించిన ఋషి మునుల, ఆదర్శ పురుషుల జీవన విధానమును ఆదర్శముగా

గాని అనుసరించుచు వారినుండి విద్యా విజ్ఞానముల నేర్చుకొనుడు. మీ మీ నడవడులను సవరించు కొనుడు" అని ఎలుగెత్తి చాటెను.

సృష్ట్యాది నుండి మహాభారత కాలము వరకు భోగ భాగ్యములలో కూడా ఈ దేశమును మించిన దేశము మరొకటి ప్రపంచమున లేకుండెడిది. ఈ దేశముతో సంబంధము పెట్టుకొన్న లోహరూప దేశములన్నియు పరుసవేదిని తాకినట్లుగ స్వర్ణమయము లయ్యెడివి. ఈ విషయమును మహర్షి దయానందుడు సత్యార్థ ప్రకాశమున వివరించుచు "పరుసవేది యను రాయి ఉన్నదను మాట అబద్ధము. కాని ఈ దేశమే యథార్థమైన పరుస వేది. లోహరూప దరిద్రావస్థలో నున్న అన్య దేశీయులు దీని తాకిన మాత్రాన సువర్ణముగా-ధనాఢ్యులుగా మారుచున్నారని నిశ్చయముగా చెప్పవచ్చును. సృష్టి మొదలుకొని అయిదువేల సంవత్సరముల పూర్వము వరకు ఆర్యులు సార్వభౌమ చక్రవర్తులుగా అనగా భూగోళమంతటిని ఏకచ్ఛత్రముగా రాజ్య మేలు చుండిరి. అన్ని దేశములందు మాండలిక రాజులు అనగా సామంత రాజులుండిరి. ఏలయనగా కౌరవ పాండవుల కాలము వరకు నిచ్చట రాజ్యమునకును, రాజ శాసనమునకును భూగోళమందలి రాజులందరును సమస్త ప్రజలును లోబడి వర్తించు చుండిరి" అని వివరించెను. గజనీ గోరీలవంటి దోపిడిగాండ్రు సంవత్సరముల తరబడి దోచుకున్నను వారి చేతులు నొప్పి పెట్టినవే గాని ఇచటి సంపదలు యింకను మిగిలియే యున్నవి.

ఈ ప్రపంచములో అది మానవ సృష్టి జరిగినది ఈ భారత భూమి పైననే. వాయు, జల, భూచర ప్రాణులన్నిటిని సృజించిన పిదప పరమేశ్వరుడు ఎత్తైన పీఠ భూమిగా చెప్పబడు త్రివిష్టపము (టిబెట్టు)లో మానవావసరములన్నిటిని సృజించిన తదుపరి అనేక

మంది స్త్రీ పురుషుల నుద్భవింప జేసెను. ఆ ఆది మానవులలో యోగ్యులైన నలుగురు ఋషులకు తాను గావించిన సృష్టి యొక్క విజ్ఞానమంతయు మరియు జీవనావసరములకు, ఉన్నతికి కావలసిన జ్ఞానమంతయు అంతర్యామియై వేదము ద్వారా ఉపదేశించెను. ఆ ఋషులనుండి గ్రహించిన వేద జ్ఞానముతో ఆది మానవులు బుద్ధి వికాసమును పొంది శ్రేష్ఠతమ ప్రాణులై ఆ జ్ఞానమును తమ సంతానమునకు, శిష్యులకు అందజేయుచు జీవన పోరాటమున ప్రపంచ మంతట వ్యాపించిరి. అందుచే భారతమాతయే ప్రపంచ మానవుల జనని. భారతావనియే ప్రపంచ మానవులలో జ్ఞాన బీజములను మొదటగా నాటిన ఆది గురువు.

కేవలము ఆది గురువే గాక సృష్ట్యాది నుండియు మహాభారత కాలము వరకు వివిధ విద్యల గురువుగా నుండెడిది. భారతమాతయే మహాభారత కాలము వరకు ప్రపంచము నేలిన స్మామ్రాజ్ఞి. ఏ దేశ చరిత్రను పరిశీలించినను అయిదువేల సంవత్సరములకు పూర్వపు చరిత్ర కానరాదు. ఎచ్చటనైనను కొలదిగా కానవచ్చినను అది ప్రపంచ సామ్రాజ్యము నేలిన చరిత్ర కాదు. కాని మహాభారత కాలము వరకు ఆర్య వీరులు రాజసూయాది మహాయజ్ఞములుచేసి దేశ దేశాంతర ములలో తమ వీరత్వమును చవిచూపి ప్రపంచ చక్రవర్తి రాజ్య వ్యవస్థను జేయుచు భారతమాతను ప్రపంచ సామ్రాజ్ఞిగానే నిలుపుతూ వచ్చిరి.

నేటి యువతకు మన మాటలకన్న పాశ్చాత్యుల మాటలే మిన్న. వాటి పైననే వారికి గురి మెండు. ఆ విదేశీయులే భారతమాతను ఏ విధముగా కీర్తించిరో వినుడు..

ప్రసిద్ధ జర్మను విద్వాంసుడైన మాక్సు ముల్లర్ భారత దేశము

పైనను వేదముల పైనను మొదట అల్పభావనే కలిగి యుండెను. మహర్షి దయానందుని గ్రంథములను చదివిన పిదప అతనిలోని వివేకము జాగృతిజెందె తన చివరి దినములలో రచించిన "ఇండియా వాట్ కెన్ ఇట్ టీచ్" (India what can it teach) లో భారత మాతను ఈ విధముగా కొనియాడెను—

"సమస్త ప్రపంచములో ప్రకృతి ద్వారా లభించిన సౌందర్యముతో, శక్తి సంపదలతో అలరారుచు సర్వ సాధన సంపన్నమైన దేశమేది ? యని నన్నడిగిన నేను భారత దేశమునే చూపుదును." ఎవరేని నన్ను మానవ మేధస్సు ఏ ఆకాశములో తన ప్రముఖ గుణములతో, శక్తులతో వికసించినది ? జీవనమునకు సంబంధించి అన్నిటికన్న మహత్వ పూర్ణమైన సమస్యలపై అందరికంటె లోతుగా నాలోచించినది ? వానిలో కొన్నింటికి ప్లాటో, కాంట్ లవంటి ఐరోపా తత్త్వవేత్తల సాహిత్యమును అధ్యయనము చేసిన వారికి గూడా మార్గ దర్శకము కాగల సమాధానము కనుగొన్నది ? ఏ దేశము ? అని అడిగినచో నేను భారత దేశము వైపు సంకేతము చేయుదును."

"ఒకవేళ కేవలము యూనానుల, రోమనుల, సెమెటిక్ (యూదుల) జాతుల ఆలోచనా సరళిలో చాలా వరకు పెరిగిన ఐరోపా వాసులమైన మేము ఏ సాహిత్యము నాశ్రయించి మా జీవితమును మిక్కిలి పూర్ణము, అధిక విస్తృతము, వ్యాపకము, అత్యంత సార్వజనికము, మహోన్నత మానవీయము చేసికొనుటకు; ఈ లోకమునే కాక శాశ్వత దివ్య జీవితమును కూడా సంస్కరించగల వస్తువును పొంద గలుగుదుము ? అని నన్ను నేనే ప్రశ్నించుకొనినచో నేను మరల భారత దేశమునే చూపగలను".

ఇక మి. డెల్మార్ మహాశయుడు కేవల విద్యా విజ్ఞానములే గాక వివిధ భౌతిక సంపదలు కూడ భారత దేశము నుండియే ప్రపంచ మంతట వ్యాపించినవని ఈ విధముగా తన అభిప్రాయమును వెల్లడించెను--

"పాశ్చాత్య జగత్తు ఏ విషయములపై గర్వించుచున్నదో అవి వాస్తవముగా భారత దేశము నుండియే అచటికి చేరినవి. ఆ విషయము లటుంచనిండు ఇప్పుడు ఐరోపాలో పండుచున్నట్టి వివిధ ఫల పుష్పములు, వృక్షగుల్మములు అన్నియు భారతదేశము నుండియే తీసుకొని పోబడి నాటబడినవి. మల్మల్, పట్టు, గుడ్డములు, తగరము వీటితోబాటు ఇనుము, సీసము ప్రచారము గూడా భారతదేశము నుండియే ఐరోపా దేశములలో వ్యాపించినది. ఇంతేకాదు జ్యోతిష్యము, వైద్యము, అంక గణితము, చిత్రకళ, విధి శాస్త్రములను గూడా భారత దేశీయులే ఐరోపా వాసులకు నేర్పిరి."

వైదిక ధర్మము, విజ్ఞాన వంతమైనది. ఈ సందర్భమున ఆంగ్ల భాషా శాస్త్రవేత్తయైన డబ్ల్యు.డి. బ్రౌన్ మన వైదిక సంస్కృతిని గూర్చి నుడివిన మాటలు సువర్ణాక్షరములలో వ్రాయ దగినవి.

"Vedic Religion is a thoroughly Scientific religion. Where Religion and Science meet hand in hand. Here theology is based upon Science and Philosophy."— వైదిక ధర్మమొక సంపూర్ణ వైజ్ఞానిక ధర్మము. ఇచ్చట ధర్మము, విజ్ఞానము భుజము, భుజము కలిపి నడిచినవి. ఈ ధార్మిక సిద్ధాంతములకు విజ్ఞాన తత్త్వ శాస్త్రములు ఆధారము.

ఇంకను ప్రొ. హీరేన్, మేజరు డీ. గ్రాహంపోల్, ఎల్ఫిన్స్టన్, మెక్డానల్, విలియాంజా మొదలగు విదేశీ విద్వాంసులు ఎంతగానో

భారత దేశమును కొనియాడిరి. స్థలాభావముచే వాటినన్నిటిని నిచట పొందు పరచుటకు వీలు పడకున్నది. అయితే అట్టి సర్వ సుగుణ సంపన్నమైన మన భారతదేశ అవనతికి కారణమేమి ? అని కూడా ఆలోచించవలసి యున్నది.

## అవనతికి కారణము లేమి ?

సృష్టిలో ప్రయోజనముకన్న అధికముగా ఐశ్వర్యము హెచ్చినపుడు ఆలస్యము (సోమరి తనము), పురుషార్థ రాహిత్యము, ఈర్ష్య, ద్వేషము, విషయాసక్తి, ప్రమాదములు (పొరపాటులు) హెచ్చుట సహజముగానే జరుగుచుండును. అదియే మన దేశమునను జరిగినది. పరిణామమే మహాభారత యుద్ధము. భారత యుద్ధానంతరము ధర్మ ప్రచారము, ప్రచారకులు లోపించి దేశమందు మద్య మాంసముల సేవనము, బాల్య వివాహ, సతీ సహగమన, స్వేచ్ఛాచారాదులు, అనేక వ్యసనములు, దుర్గుణములు, మూఢ నమ్మకములు ప్రబలెను, పెచ్చు పెరిగిన సైనిక, ఆయుధ శక్తులతో రాజులలో అభిమానము పెరిగి అన్యాయము వృద్ధి జెందెను. అప్పుడు రాజులు పరస్పర విరోధులై తాము నశించుటయే గాక దేశమును విదేశీయుల పాలొనర్చిరి.

దీనితోపాటు ఏకేశ్వరోపాసన స్థానమున అనేక ఈశ్వరుల ఆరాధన ప్రారంభమయ్యెను. పరమేశ్వరుని గుణకర్మలను తెలుపు వివిధ నామములకు నామమునకొక రూపమును కల్పించి దానికొక ఆకారము, ఒక చరిత్ర, ఒక ఆరాధనా పద్ధతి కల్పించి సాంప్రదాయముల నేర్పరచిరి. సాంప్రదాయకుల పరస్పర విరోధముతో జాతి ఐకమత్యమును గోల్పోయి ఛిన్నాభిన్నమయ్యెను. జడారాధనతో విద్యా విజ్ఞానములు నశించి బుద్ధి జడత్వమును బొందెను. ఫలిత జ్యోతిష్యమును నమ్మి పురుషార్థహీన మయ్యెను. జనులు తమ

అదృష్టమునకు గ్రహములే కారణమని నమ్మి వాటిని శాంతింప పూజలు చేసిరేకాని కర్మశీలురు కాలేక పోయిరి. వీటితోపాటు బౌద్ధ జైనుల మిథ్యా అహింసా వాదము, శంకరుని జగన్మిథ్యా వాదము జాతిని నపుంసక మొనర్చెను. ఒక ప్రక్క 'శివోఽహం' అనుకుంటు సోమరి సాధువుల గుంపులు తయారు కాగా మరియొక ప్రక్క 'ఒక చెంప కొట్టిన మరియొక చెంప చూపవలె'నను హీన భావములు వృద్ధి జెందెను. శత్రువులు దేశముపై దండెత్తి వస్తే ఏదో భగవంతుని అవతారము వచ్చి రక్షిస్తుందని నమ్మి ఎదురు చూచిరే కాని "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః" అను వేదోపదేశమును గాని "కర్మణ్యేవాధికారస్తే" అను శ్రీ కృష్ణుని ఉపదేశమును గాని అనుసరించ లేక పోయిరి. శత్రువుల నెదిరించ ముందుకు వచ్చిన యువకుల ఉత్సాహమును గూడ నీరు గార్చి పరాధీనులై వేల సంవత్సరములు బానిస జీవితమును గడిపిరి.

విదేశీయులు మన భౌతిక సంపదలను దోచుకొనుటయే గాక విద్యా విజ్ఞానములను, కళా కౌశలములను, సభ్యతా సంస్కృతులను గూడా దోచుకొనిరి. విద్వాంసులను, విజ్ఞాన గ్రంథములను అగ్నికి ఆహుతి జేసిరి. కళాకారులను అంగవికలురను జేసిరి. విద్యాదానమను కన్నిటి తుడుపుతో లార్డ్ మెకాలే విద్యా విధానము ద్వారా మన సభ్యతా సంస్కృతులపై వారి సభ్యతా సంస్కృతుల చెరుగని ముద్ర వేసిరి. అవి సౌమ్య విషము (Slow poisoning) గా జాతి తర తరాలను పీల్చి పిప్పి చేయుచున్నవి. ఆ ముద్రిలు ఎప్పటికైనా చెరగునా ? అని ఆశావాదులకే సందేహముగా నున్నది.

ఈ విధముగా మన భారతమాత తన ప్రాచీన వైభవమును గోల్పోయి కళా విహీనమై దీన వదనముతో ఎప్పటికైనా తన పుత్రులు

తన్ను కాపాడక పోవుదురా అని ఎదురు చూచినది.

## స్వాతంత్ర్య సిద్ధి

మన భారతమాతను మధ్య కాలములో ఏర్పడిన చెరనుండి విడిపించుటకు ఎందరెందరో ఎన్నెన్నియో త్యాగములు చేసిరి. క్రీ.శ. 1857 లో తాంత్యా తోపే, ఝాన్సీ లక్ష్మీబాయిలతో ప్రారంభమైన స్వాతంత్ర్య సంగ్రామము 1947 లో ముగిసి మనకు అగస్టు 15 న స్వాతంత్ర్యము సిద్ధించినది. ప్రతి సంవత్సరము ఆనందోత్సాహములతో ఆ రోజును పండుగగా జరుపుకొను చున్నాము. అసువుల బాసిన బలిదాన వీరులకు జోహారు లర్పించు చున్నాము. కాని అందు కూడా కుహనా రాజకీయములే రాజ్యమేలుచున్నవి. కొందరికే ఘనముగా నివాళు లర్పించుటయు కొందరిని పూర్తిగా విస్మరించుటయు జరుగు చున్నది. భారతీయులను తట్టి లేపి, వారి ప్రాచీన వైభవమును గుర్తుచేసి, వారి నాడులలో ప్రప్రథమముగా స్వాతంత్ర్యేచ్ఛా బీజములు నాటిన ఆది పురుషుని మరచి పోవుట ఒక క్షమించరాని నేరము కాదా? ఎవరా ఆదిపురుషుడు? ఆతడే మహర్షి దయానందుడు.

మహర్షి దయానందుడు (1824-1883) తన రచనలలో ప్రవచనములలో భారతదేశ ప్రాచీన వైభవమును, వీరత్వమును గుర్తు చేయుచు స్వాతంత్ర్య పోరాటానికి ప్రేరణ నిచ్చెడివాడు. కొంత కాలము అజ్ఞాతముగా గడిపి దేశభక్తుల కుత్సాహ మిచ్చినాడు. దాని ఫలితమే ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామము. రాజపుత్రుల రక్తములో ప్రాచీన రాజసము వంశ పారంపర్యముగా (Genes ద్వారా) ప్రవహించు చుండునను ఆశతో రాజపుత్ర రాజులకు అతిథియై వారికి రాజ ధర్మమును, సదాచారమును, దేశభక్తిని, స్వాతంత్ర్య కాంక్షను

బోధించుచు విశేషముగా ప్రయత్నించెను. భారత దేశ అవనతికి విలపించుచు గంగా తీరమున అనేక రాత్రులు గడిపెను. ఆంగ్లేయ పాదరీల, గవర్నరుల ఎదుటనే వారి మతములలోని లోపములను, పరిపాలనలోని లోపములను నిర్భయముగా ఎత్తి చూపెను. తన అమర గ్రంథమైన సత్యార్థ ప్రకాశము (1875) లో ప్రసంగవశమున "ఎవరెంత చేసినను స్వదేశీయ రాజ్యమే సర్వాంశములందు ఉత్తమము అనుట స్పష్టము. ఇక మత మతాంతరముల మూర్ఖపు పట్టుదల గాని, స్వపక్ష, పరపక్ష, పక్షపాతము గాని లేక ప్రజలయందు తలి దండ్రుల వంటి కృపగలిగి, దయా న్యాయములతో గూడి యున్నను విదేశీయుల రాజ్యము సంపూర్ణ సుఖదాయకము కానేరదు" అని వ్రాసెను. దీనిని బట్టి వారి స్వాతంత్ర్యేచ్ఛ ఎంత గాఢమైనదో, ఉన్నతమైనదో తెలియ గలదు.

నేడు 'స్వాతంత్ర్య' పద జన్మదాతగా కీర్తింపబడు దాదాభాయి నౌరోజీ కన్న పూర్వమే మహర్షి దయానందుడు ఈ పదమును తన ప్రవచనములలో, గ్రంథములలో ప్రయోగించినట్లు అనేక ఆధారము లున్నవి. లోకమాన్య బాల గంగాధర తిలక్ ఒకచోట మహర్షి దయానందుని గూర్చి తన భావమును వ్యక్త పరచుచు "దయానంద మహర్షి భారతీయాకాశమున తన యలౌకికమైన ప్రకాశముతో ప్రకాశించు జ్వాజ్వల్యమానమైన నక్షత్రము. అతడు గాఢ నిద్రా ముద్రితమైన భారతమును మేల్కొల్పినవాడు. "స్వరాజ్య" సందేశ వాహకులలో నతడు సర్వ ప్రథముడు. అతడు మానవత నుపాసించువాడు" అని నుడివెను. ఆ స్వరాజ్య పదమే బాల గంగాధర తిలక్ హృదయములో మారుమ్రోగి 'స్వాతంత్ర్యము నా జన్మ హక్కు' అను నినాదమునకు ప్రేరణ నిచ్చినది. ఆ పదమే తదుపరి భారతీయులకు కొన్ని హక్కుల

కోసం పోరాడటాని కేర్పడిన కాంగ్రెసుకు నినాదమైనది. మహర్షి దయానందుని ఈ ప్రేరణయే లేకున్న 'స్వాతంత్ర్య' శబ్దముగాని, దానిని పొందు అభిలాషగాని కాంగ్రెసుకు ఎప్పటికి లభించెడిదో ఊహాతీతము. ఆ తరువాత ఆ "స్వాతంత్ర్య" పదమే భారతీయుల మంత్ర జపమైనది. అదే మత మతాంతర సాంప్రదాయముల నేకము చేసి భారత జాతిని సంఘటితము చేసినది. దాని ఫలితమే 1947 లో స్వాతంత్ర్య సిద్ధి. ఎవరెంత చేసినను, పోరాట చివరి దశలో సారథ్యము వహించిన గాంధీ మహాత్మునికే ఆ కీర్తి దక్కినది. అతనికి, అతని అనుయాయులైన ఒక వర్గమునకే గుర్తింపు, పేరు ప్రఖ్యాతులు లభించినవి. తద్భిన్నమైన వారు ఎంత దేశ భక్తులైనా, ఎన్ని త్యాగములు చేసినా నామ మాత్రులైనారు. అందు ప్రథమ ప్రేరకుడైన మహర్షి దయానందునకు అసలు గుర్తింపే లేకుండా పోయినది. ఇది కృతఘ్నత కాదా?

దయానందుని అనుయాయులైన ఆర్య సమాజికులే స్వాతంత్ర్య పోరాటములలో ప్రముఖ పాత్ర నిర్వహించిరి. లాలా లజపతిరాయ్, స్వామి శ్రద్ధానంద్ దయానందుని అనన్య భక్తులు. దయానందుని ప్రేరణతోనే శ్యాంజీ కృష్ణవర్మ ఇంగ్లండు చేరుకొని భారతీయ విద్యార్థులకు వ్యవస్థ జేయుచు అక్కడ భారతీయులలో స్వాతంత్ర్యేచ్ఛను జ్వలింప జేసెను. దాని ఫలితముగనే సర్దారు భగత్సింగ్, చంద్రశేఖర్ ఆజాద్ వంటి విప్లవ వీరు లుదయించిరి.

భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు తమ "కాంగ్రెసు చరిత్ర" అను గ్రంథములో ఈ సత్యమును ప్రకటించుచు "నాటి సహాయ నిరాకరణ ఉద్యమములో పాల్గొన్న వారిలో 80 శాతము ఆర్య సమాజీయులో లేక మహర్షి దయానందుని గ్రంథ పఠనముతో ప్రేరితులైనవారో యుండిరి". అని వ్రాసిరి.

ఈ విషయమునే ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు వీర సావర్కర్ చక్కగా వివరించెను .

"దయానంద మహర్షి స్వాతంత్ర్య సంగ్రామమున ప్రథమ యోధుడు. హిందూ జాతి రక్షకుడు. మహర్షి స్థాపిత ఆర్య సమాజము రాష్ట్రమునకు గొప్ప సేవ జేసినది. చేయుచున్నది. స్వాతంత్ర్య సంగ్రామమున ఆర్య సమాజికులు ఎక్కువగా పాల్గొనిరి. మహర్షి లిఖితమైన అమర "సత్యార్థ ప్రకాశము" హిందూ జాతి నర-నాడులలో ఉష్ణ రక్తమును సంచారము చేయించును. సత్యార్థ ప్రకాశమున్నంత వరకు విధర్మియైన సంప్రదాయకు డెవ్వడును తన ఐడాయిని ప్రదర్శింప జాలడు" అని కొనియాడెను.

## మన కర్తవ్యము

ఎందరో మహానుభావుల త్యాగ తపో బలిదానములతో సిద్ధించిన స్వాతంత్ర్యమును పరిరక్షించుకొనుట మన మొదటి కర్తవ్యము. మత మతాంతర సాంప్రదాయములలో చిక్కుపడక, ప్రాంత భాషా భేదములను విడిచి, రాష్ట్రీయ భావనను పెంచుకొనుచు ఒకే భారత జాతిగా ఏర్పడుట మన ద్వితీయ కర్తవ్యము. ప్రాచీన భారతీయ సంస్కృతీ సభ్యతల ననుసరించుచు ఆత్మోన్నతికి, దేశోన్నతికి కృషి చేయుచు ప్రాచీన భారత గౌరవమును పున రుద్ధరించుట మన తృతీయ కర్తవ్యము.

పై మూడు కర్తవ్యములు నేటి భారతీయులలో లోపించు చుండుట దురదృష్టకరము. జన్మ నిచ్చిన తల్లితో సమానమైన జన్మ భూమిని-మాతృభూమిని తల్లిగా గాక వెలయాలుగా జూచు వర్గములు యిచట పెరిగి పోవుచున్నవి. వివిధ మత ప్రచారకుల కుయుక్తుల

వలలో ఓడి అమాయక ప్రజలు విదేశీ భక్తులగు చున్నారు. ఆ యా దేశముల వైపు దిరిగి మ్రొక్కులిడుచు ప్రార్థనలు జేయుచున్నారు. చివరకు క్రొత్త ఆటలలో భారతీయులు ఓడి విదేశీయులు గెలు పొందితే పండుగలు జేసికొనుచున్నారు. భారతీయ గౌరవ మర్యాదలను ప్రపంచ గగనమున మహోన్నత స్థానములో చిరస్థాయిగా నిలిపిన రామ కృష్ణాది మహాపురుషుల జన్మదినములు వారికి గిట్టవు. ఎక్కడో పుట్టి. ఏ కొద్ది మందికో, ఏ కొద్ది ప్రయోజనమో చేకూర్చిన క్రీస్తు మహమ్మదుల జన్మ దినములనిన వారికి ప్రీతి మెండు. మానవుని దివ్య మానవునిగా జేయు భారతీయ సంస్కృతీ సభ్యత లనిన వారికి యే మాత్రము పడవు. విజ్ఞాన విరుద్ధము, అనారోగ్యకరము, మానవుని సంకుచిత భావములతో కూపస్థ మండూకమును చేయు విదేశీ సభ్యతా సంస్కృతు లనిన వారికి ఎనలేని గౌరవము. ఖగోళ విజ్ఞాన సమ్మతము, హేతుబద్ధమునైన సంవత్సరాది - యుగాది వారికి సమ్మతము కాదు. ఖగోళ విజ్ఞానముతో ఏ మాత్రము పొంతనలేని ఆంగ్ల సంవత్సరాది మొదలగునవి వారికి శిరోధార్యములు. భాషలో, భావములో, ఆచార వ్యవహారములలో విదేశీయులే వారికి గురువులు. రాష్ట్రీయభావనకు, రాష్ట్ర ఉన్నతికి ప్రేరణనిచ్చు ఒక్క భావనగూడ ఆ విదేశీ మత గ్రంథములలో కంచు కాగడాబెట్టి వెదికినను కానరాదు. కాని మన ఆదిమ జ్ఞాన స్రోతస్సు వేదములందు రాష్ట్రీయభావనలను వెదజల్లు భావములు కోకొల్లలు.

## వైదిక రాష్ట్రీయభావన

వైదిక ధర్మములో రాష్ట్రీయభావన ఒక ప్రధాన అంగము. కేవల రాష్ట్రీత క్రియేగాక రాష్ట్రోన్నతికి తద్వారా మానవోన్నతికి కావలసిన మార్గదర్శక సూత్రము లందు విస్తృతముగా గలవు.

ముఖ్యముగా అథర్వ వేదములో 63 మంత్రములు గల పృథ్వీ సూక్తము మానవ మాత్రునిగా ఏ దేశ వాసియైనను కలిగి యుండవలసిన రాష్ట్రీయ భావనను వివరించును. వేదము మానవుని రాష్ట్రముతో మాతా పుత్ర సంబంధముతో బంధించును. అట్టి ప్రేరణతో జాగృతి చెందిన మానవుడు.

"మాతా భూమిః పుత్రోఽహం పృథివ్యాః" (అథర్వ 12-1-12)

"భూమి నా తల్లి. నేను భూమికి పుత్రుడను" అని ఘోషించును.

అవసరమైన అట్టి భూమాత రక్షణకు "తుభ్యం బలిహృతః స్యామ" (12-1-62) నీ రక్షణకు ఆత్మబలి నర్పించుటకు సిద్ధముగా నున్నానని ప్రతిజ్ఞ చేయును. కేవలము ఆపదలో ఆదుకొనుటయే పుత్రుని కర్తవ్యము కాదు. తన తల్లి కీర్తిని నలుదిశల వ్యాపింప జేయవలయును. ఆమె కీర్తికి కళంకము నాపాదించు ఏ చెడు కార్యము ఎక్కడను, ఎప్పుడును చేయరాదు.

యే గ్రామా యదరణ్యం యాః సభా అధి భూమ్యామ్।
యే సంగ్రామాః సమితయస్తేషు చారు వదేమ తే॥ (అథర్వ 12-1-56)

"ఓ మాతృ భూమీ ! గ్రామ పట్టణములలో, అరణ్య గురుకుల ఆశ్రమాదులలో, రాజ న్యాయ ధర్మ సభాదులలో, విద్వత్సమితులలో (పరిషత్తులలో), యుద్ధ భూములలో నీ కీర్తిని శ్లాఘించుచు నీ కపకీర్తిని దెచ్చు ఏ చెడుగును మేము చేయకుందుము గాక" అను సంకల్పము (వ్రతము)ను గైకొన వలయును. అట్టి వ్రతశీలురు దీక్షా తపస్సులతో రాష్ట్ర బల ఓజస్సులను వృద్ధి చేయవలెను.

మానవులకు రాష్ట్ర నిర్మాణ ప్రేరణ నిచ్చినది వేదమే కాని ప్రాకృతిక జంతు జాలములు కావు. ప్రకృతిని పరిశీలించుచు క్రమ

వికాస జ్ఞానముతో రాష్ట్ర గృహస్థాశ్రమాది నిర్మాణములు జరిగినవని వాదించు నవ పరిణామవాదులు ఏ జంతు జాలమునుండి వాటిని మానవులు నేర్చుకొనిరో వివరించవలసి యున్నది. ప్రథమ మానవ సృష్టి సమయమున సిద్ధులైన ప్రథమ మానవుల (ఋషుల) హృదయ ములలో పరమేశ్వరుడే వేదము ద్వారా రాష్ట్రనిర్మాణ ప్రేరణను, అందుకు అవసరమైన సూత్రములను ప్రకాశ పరచెను. ఆ జ్ఞానముతో దీక్షా తపస్సుల నాచరించి తోటి సామాన్య మానవులను జ్ఞానవంతులజేసి రాష్ట్ర-రాజ్య వ్యవస్థను చేసిరి. అప్పుడు మానవుల వైయుక్తిక బల ఓజస్సులు సంఘటితపడి రాష్ట్రీయ బల ఓజస్సులు నిర్మింపబడెను. అట్టి రాష్ట్రీయ బల ఓజస్సులు మహోన్నతములైనవి. వాటివలననే మానవజాతి మనుగడ సుఖ శాంతి ప్రదమయ్యెను. లేకున్న సంఘటితము కాని జంతువులవలె ఛిన్నా భిన్నమయ్యెడిది. ఈ విషయము భావితరములు గుర్తించుకొన వలెనని పరమేశ్వరుడు ఒక వేద మంత్రమును నిర్మించెను. అది ఏమన—

భద్రమిచ్ఛంత ఋషయః స్వర్విదః
తపో దీక్షా ముపనిషేదురగ్రే ।

తతో రాష్ట్రం బలమోజశ్చ జాతం
తదస్మై దేవా ఉపసంనమన్తు ॥ (అథర్వ 19-41-1)

సమాధి సుఖమును పొందిన ఋషులు లోక కళ్యాణమును గోరుచు ఆదిలో తపస్సును, దీక్షను గ్రహించిరి. ఆ తపో దీక్షల వలన రాష్ట్ర ముత్పన్నమయ్యెను. దానితోబాటు రాష్ట్రీయ బల ఓజస్సులు ఉత్పన్నమైనవి. గాన అట్టి రాష్ట్రము నెదుట దేవతలు, విద్వాంసులు కూడా బాగుగా నమ్రులగుదురు గాక-సత్కరింతురు గాక ! విద్వాంసుల తపో దీక్షల వలన ఈ రాష్ట్రీయ బల ఓజస్సులు నిర్మింపబడినను

వాటి సామూహిక బల ఓజస్సుల ముందు విద్వాంసుల బల ఓజస్సులు ఏపాటివి ? అందుచేత వారు (విద్వాంసులు) కూడ వాటి ముందు వినమ్రులై సత్కరింపవలెను. నేడును విద్వాంసుల, విజ్ఞానవేత్తల కళాకారుల, క్రీడాకారుల విశేష బుద్ధి వైశిష్ట్యముతో ఈ దేశ కీర్తి నలుదిశల వ్యాపించు చుండును. వారి వలన మన దేశకీర్తి ఉన్నత శిఖరాల నధిగమించినను దానికి వారు గర్వించక తల్లి యెదుట నమ్రులైనటుల దేశము ఎదుట నమ్రులు కావలెనని పై వేదమంత్ర సందేశము.

ఇక రాష్ట్రోన్నతి ఏ మూల సూత్రముల పునాదులపై పై పై కెదుగుచుండునో పృథివీ సూక్తము నందలి మొదటి మంత్రము మనకు వివరించును. అదియేమనగా—

సత్యం బృహన్ ఋతముగ్రం దీక్షా తపో బ్రహ్మ యజ్ఞః
పృథివీం ధారయన్తి ।
సా నో భూతస్య భవ్యస్య పత్న్యురుం లోకం పృథివీ నః
కృణోతు ॥ (అథర్వ 12-1-1)

గొప్పదైన సత్యము, ఉగ్ర స్వభావము గల ప్రాకృతిక నియమ విజ్ఞానము, ధర్మ కార్యముల నాచరించు దీక్ష, శారీరక వాచిక మానసిక తపస్సులు, బ్రహ్మ (వేద) జ్ఞానము, అగ్నిహోత్రము మొదలు అశ్వమేధ పర్యంతము నుండు యజ్ఞ విజ్ఞానము - ఇవే మాతృభూమిని ధరింపజేయ వలసిన ఉత్తమ గుణములు. అట్టి సుగుణ భూషితయైన పృథివి (దేశము) వర్తమాన మందే గాక భూతకాలమునందును చక్కగా ప్రజలను పాలించినది. భవిష్యత్తునందును చక్కగా పాలింపగలదు. అట్టి మాతృభూమి మాకు (మా దేశ పౌరులకు) ప్రపంచమున ఉన్నత స్థానమును గల్పించును గాక !

పై గుణములు పృథివి వంటి జడ పదార్థములందుండునవి కావు సచేతనులైన మానవులందుండును. గాన పై గుణములు గల మానవులచే విశేషించి రాజులచే, నాయకులచే ధరింపబడిన ఆ పృథివి (మాతృభూమి) ఆ దేశ పౌరులను చక్కగా పాలించి పోషించును. ప్రపంచమున ఆ దేశమును ఉన్నతముగా నిలుపును. ఇక, ఆ గుణములలోని ఔచిత్యమేమో ఆలోచింతము—

"సత్యం బృహత్" గొప్పదైన సత్యము. వేదము రాష్ట్రోన్నతిలో సత్యమునకు ప్రథమస్థాన మిచ్చెను. దానికి 'బృహత్' అను విశేషణమును జోడించి దాని మహత్త్వమును మరింత గొప్పగా జేయును. అట్టి సత్యమునకు నేడు విలువలేకున్నది. ప్రతి వ్యాపారి వ్యాపారములో సత్యము పలికిన నష్టము కలుగుననును. ప్రతి వకీలు సత్యము పలికిన తమ వకాలతు జరుగదనును. ప్రతి రాజకీయ నాయకుడు రాజకీయాలలో సత్యమునకు స్థానమే లేదనును. కాని విచిత్రమేమన పై వారందరు ఇతరుల అసత్య ప్రవర్తనను తూర్పార బట్టి లాభము పొంద జూచు అవకాశవాదులే. ఇతరుల అసత్యమును తాము ప్రకటించు చున్నటులే ఇతరులు తమ అసత్యమును ప్రకటించ గలరను సత్యమును గుర్తించుట లేదు. అంత మాత్రము గుర్తించిన కొంతలో కొంత వారికి మేలు జరిగెడిది. వ్యాపారములో సత్యము పనికి రాదనుట వారి మూర్ఖత. సత్య నిష్ఠులైనవారి వ్యాపారము క్రమముగా వృద్ధిజెంది చిరకాలము ప్రకాశించును. ప్రజలు వెల ఎక్కువైనా అట్టివారి వద్దనే తమ అవసరములను కొన గోరుదురు. అట్టి ఉత్పత్తి కేంద్రములే చిరకాలము వృద్ధి చెందును. అసత్య మార్గమున పయనించు వ్యాపారులు, ఉత్పత్తి కేంద్రములు ఒక వెలుగు వెలిగి మాడి పోవును. అట్లే వకాలతునందును, రాజకీయములందును నని

గ్రహించవలెను. నేటికిని కొంతయైనా సత్యమున్నది కనుకనే మన జీవితము లిట్లు సాగుచున్నవి. వ్యాపారివద్ద సరుకు తీసికొని ముందే పైసలిచ్చినానని వినియోగదారుడు అబద్ధ మాడిన ఎవరు సాక్ష్యము? అట్లే వ్యాపారి డబ్బు ముందు తీసికొని సరుకిచ్చి మరల పైసలడిగిన ఎవరు సాక్ష్యము? అటులైన మన జీవితము లెంత దుర్భరములగునో యోచించుడు.

సత్యము వ్యక్తిగత సత్యము, సామాజిక సత్యము, రాష్ట్రీయ సత్యమునని వివిధ రూపముల నుండవచ్చునని పెద్దలు చెప్పుదురు. భారతీయులు వ్యక్తిగత సత్య పాలనలో అన్ని దేశములకన్న ఇప్పటికిని మిన్నయే. సామాజిక సత్య మన సత్యాగ్రహ రూపములో సమ్మెలుగా జరుగు పోరాటము. ఒక వ్యక్తికి గాని, కొందరికి గాని అన్యాయము జరిగినపుడు ప్రజలలో కలుగు వ్యతిరేకత. అది ఆందోళనగా, సమ్మెగా, నిరసన ప్రదర్శనగా నుండును. అట్టి వ్యతిరేకత తెలుపవచ్చును గాని రాష్ట్ర సంపదను గాని, వ్యక్తుల సంపదను గాని నష్ట పరచుట మంచిది గాదు. ఎప్పుడైనా రాష్ట్రము ఏ కొద్ది స్వార్థపరుల చేతిలోనికో పోయినపుడు ప్రజా ఉద్యమము బయలు దేరును. ఇది రాష్ట్రీయ సత్యమును కాపాడుటకు జరుగు పోరాటము. మహాత్మా గాంధీ నాయకత్వమున జరిగిన స్వాతంత్ర్య పోరాటము, ఈ మధ్య రష్యాలో జరిగిన ప్రజా ఉద్యమము మొదలైనవి ఇందు కుదాహరణములుగా చెప్పవచ్చును. ప్రజలలోని, నాయకులలోని అట్టి సత్య నిష్ఠయే మాతృభూమిని ధరించు మొదటి సుగుణము.

<u>"ఋత ముగ్రమ్"</u>—'ఋత' మనగా యథార్థతయని సామాన్యార్థము. కాని వైదిక భాషలో ప్రకృతిలో నెలకొనియున్న యథార్థ (స్థిర) నియమములను ఋత మందురు. ఇవి ఉగ్ర స్వభావము కలవి

పిటికి యెవరిపైనా దయాదాక్షిణ్యము లుండవు. ఉదాహరణకు - అగ్ని కాల్చు గుణము కలిగి యుండును. దానిని తెలిసి పట్టుకొన్నా తెలియక పట్టుకొన్నా కాల్చును. చిన్న పిల్లవాడు ఎఱ్ఱని పండు అని భ్రమించి పట్టుకొన్నను అది దయ తలచదు. కాల్చును. 'యద్భావం తద్భవతి' ఎట్లనుకున్న అట్లగునని తలంచు మూర్ఖులు పట్టు కున్నను అది కాల్చి తీరును. మన భావన వలన ప్రాకృతిక గుణములు మారవు. అందు చేతనే వాటిని ఋత మనియు, అవి ఉగ్ర స్వభావము గలవనియు ఈ మంత్రము తెలుపుచున్నది. ఆహార విహారములలో, జీవన వ్యవహారములలో ప్రాకృతిక నియమముల ననుసరించుట వలన మనకు మేలే జరుగును. వ్యతిరేకించిన దాని ఫలితము అనుభవింపక తప్పదు. ఏ దేశము ఆ నియమములను పాలించి జీవన యాత్ర గడుపునో ఆ దేశము సర్వ సుఖముల ననుభవించును.

ఇక విశేషించి ఈ ప్రాకృతిక నియమములను తెలిసికొని విజ్ఞానము నభివృద్ధి చేసికొని బహుళ ప్రయోజనములను పొంద వచ్చును. విజ్ఞాన వేత్తలు ఆ మార్గముననే పయనించి నూతన ఆవిష్కారములను, యంత్రములను నిర్మింతురు. ఏ దేశమందు యీ ప్రాకృతిక విజ్ఞానము ఎక్కువగా ఉండునో ఆ దేశము విజ్ఞాన రంగమున ఉన్నతి జెందును. అచటి ప్రజలు విశేష సుఖముల ననుభవింతురు. నేడు వివిధ దేశముల విజ్ఞాన వేత్తలు పోటీలుపడి ప్రాకృతిక నియమములను - ఋతములను తెలిసికొన ప్రయత్నించు చున్నారు. భౌతిక అన్వేషణా మార్గమున పడుతూ లేస్తూ ఎదురు దెబ్బలు తింటూ పోరాటం సాగించు చున్నారు. కాని భారతీయుల సౌభాగ్యమే మన విశ్వ నిర్మాతయైన పరమేశ్వర వాణిని - వేదములను తమ ధర్మ గ్రంథముగా కలిగి యున్నారు. వేదము సమస్త సత్య విద్యల మూల గ్రంథము. ఆ వేద జ్ఞానముతో ఋషులు నిర్మించిన

శాస్త్రీయ గ్రంథములైన ఆయుర్వేద, ఖగోళ, యంత్ర, విమానాది శాస్త్రములు ఎన్నియో గలవు. అందు విదేశీయుల ద్వేషాగ్నిలో తాంభై శాతము తగులబడినను ఇంకను కొన్ని మిగిలియే యున్నవి. వేదములు పరంపరగా కంఠస్థము చేయబడు చుండుటచే అవి పూర్తిగా సురక్షితముగా నున్నవి. వాటిని అధ్యయన పరిశీలనలు గావించిన నేటికిని విజ్ఞాన రంగమున భారతీయులే అగ్రగాములు కాగలరు. ఏ రాష్ట్రము ఈ ఉగ్ర ఋతముల జ్ఞానమును అధికముగా కలిగి యుండునో ఆ దేశము ఉన్నతి చెందును. కాన అట్టి విద్యా గుణ సంపన్నులైన మేధావంతులచే మాతృ దేశము ధరింప బడవలెను. అట్టి ఋత జ్ఞానమే మాతృభూమిని ధరించు రెండవ గుణము.

దీక్ష : పట్టుదల-ఒక సత్కార్యమును నెరవేర్చు పట్టుదల కలిగి యుండుట. అది వ్యక్తి ఉన్నతికి, రాష్ట్ర ఉన్నతికి చాలా అవసరము. అటువంటి వ్యక్తులే మహత్కారములను సాధించ గలరు. తద్వారా రాష్ట్రోన్నతి జరుగును. అయితే దీక్షను యెవరు పొంద గలరు? "వ్రతేన దీక్షా మాప్నోతి" వ్రత శీలుడు దీక్షను పొందునని వేదము చెప్పును. వ్రతమనగా తను యిష్ట పూర్వకముగా వరించు - స్వీకరించు ఒక ఉత్తమ కార్యము. అది ఉత్తమ కార్యమైనను దానియందు అభిరుచి లేకున్న దీక్షను పొందుట కష్టము. కాన వధువు వరుని వరించిన విధముగా ఉత్తమ కార్యములను స్వీకరించిన దీక్షను పొందుదురు. వ్రత దీక్షితుడు ఎన్ని కష్టములు వచ్చినను వెరువక ఉత్సాహముతో ఆ పనిని నెరవేర్చును. దీక్షితుడే ఆత్మ విశ్వాసమును పొందును. ఆత్మ విశ్వాసికి ఏనుగంత బలము వచ్చును. ఏనుగంత బలముండియు ఆత్మ విశ్వాసము లేకున్న జీవచ్ఛవమే యగును. అట్టి విశ్వాసమును దీక్షితుడే పొందగలడు. దీక్షను కలిగిన రాష్ట్ర పౌరులు అన్ని

రంగములలోను ఉన్నతి పొందగలరు. రాష్ట్రమునకు ఉన్నతిని చేకూర్తురు. దీక్షను కలిగిన రాష్ట్ర నాయకులు మహత్కార్యములను సాధించగలరు. ఎంతగా యీ దీక్ష రాష్ట్రమునందు వృద్ధి జెందునో అంతగా ఆ రాష్ట్రము ఉన్నతి చెందును. అందు చేతనే వేదము "దీక్ష యా ప్నోతి దక్షిణామ్"-దీక్ష వలన దక్షిణను-లాభమును, సత్కారమును పొందునని చెప్పును

దీక్షితుడైనను దానిని నెరవేర్చు సమర్థత లేకున్న యేమి సాధించగలడు ? అందు చేతనే మహర్షి దయానందుడు ఈ దీక్ష పదమునకు 'ఉత్తమ అధికారము' అని అర్థము వ్రాసెను. ఇట అధికారమన స్వామిత్వము, పెత్తనము అని అర్థము కాదు. కార్యము నెరవేర్చు సమర్థత యని అర్థము. ఆ కార్యముపై ఆ కళపై, ఆ విషయము పై లేక ఆ భాషపై అధికారము కలిగి యుండుట . కాన ఉత్తమ అధికారము (సమర్థత) గల దీక్ష మాతృభూమిని సువాసిత మొనర్చు మూడవ గుణము.

తపస్సు : తపస్సు అనగా ఉత్తమ కార్యమును నెరవేర్చ దీక్షితుడై అందుకు ఎదురుగ కష్టములను సహించుట. తపశ్శీలత లేకున్న ఆ దీక్షను పూర్తిచేయు సమర్థత కుంటువడును. తపస్సు అనగా శారీరక, మానసిక, వాచిక శక్తులతో పరోపకారమునకై, రాష్ట్రోన్నతికై పరిశ్రమించుట.

తపస్సన సంయమ జీవితమని మరొక అర్థము. తాను వీలైనంత తక్కువ జీవితావసరములతో గడుప వలెను. అవసరమునకు మించి వస్తువుల సేకరించి విలాస జీవితము గడిపిన ఇతరుల కన్యాయము జరుగును. తనకు ఎంత ఇల్లు అవసరమో, ఎన్ని వస్త్రము లవసరమో

ఎంత ఆహార మవసరమో అంతే స్వీకరించిన మిగిలిన వస్తువులు మరి కొందరికి ఉపయోగ పడును. దేశ దారిద్ర్యమునకు పోషకత్వమే గాక కొందరి విలాస, అసంయమ జీవితము గూడా కారణము. తపస్సు రాష్ట్రోన్నతికే గాక ఆత్మోన్నతికి విశేషముగ ఉపకరించును.

ఆధ్యాత్మిక రంగమున తపస్సనగా ద్వంద్వములను సహించుట. ధర్మానుష్ఠానమునందు ఎన్ని కష్టము లెదురైనను పట్టు విడువక పరిశ్రమించుట. ద్వంద్వ సహన మన శీతోష్ణములను, సుఖ దుఃఖములను, హాని లాభములను, మానావమానములను, విచలితుడు గాక సహించుట. ధర్మాచరణము వలన బంగారము అగ్నితప్తమై నిర్మల మగునట్లు ఇంద్రియములు, మనస్సు, ఆత్మ నిర్మల మగును ఇట్టి తపశ్శీలునకు యింద్రియముల దోషములు తొలగుటయే గాక ఇంద్రియ పటుత్వము పెరుగును.

ఏ రాష్ట్రము తపశ్శీలతతో ధరింపబడునో ఆ రాష్ట్రము అపజయ మెరుగక ఉన్నతి జెందును.

బ్రహ్మ : బ్రహ్మ యనగా 'గొప్పది' అని అర్థము. లోకములో అన్నిటికన్న గొప్ప వస్తువులు రెండు గలవు. అవి-ఒకటి పరమేశ్వరుడు రెండు అతని జ్ఞానమైన వేదము. అందుచే యీ రెంటికి బ్రహ్మ యని పేరు. వేదము పరమేశ్వర వాణి. మానవులకు కావలసిన సమస్త విద్యలు అనగా ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవిక విద్యలన్నియు యిందు గలవు. లోకములో మనకు కనపడు సమస్త విద్యా విజ్ఞానములకు, కళలకు అదియే మూలాధారము. అందు భౌతిక విజ్ఞానముతో బాటు అభౌతికములైన ఆత్మ పరమాత్మల జ్ఞానము, మనో విజ్ఞానము కలదు. అదియే మానవునకు పరమ శాంతిని ప్రసాదించును. అట్టి వేద విద్వాంసుల నిర్మాణము జరుగవలెను. అట్టి వేద విద్యలే మాతృభూమిని అలరించు అయిదవ సుగుణము.

యజ్ఞము : యజ్ఞ పదము చాల విశాలార్థము గలది. యజ్ఞ మనగా ఉత్తమ కర్మలు. తనకు, యితరులకు మేలుజేయు కర్మలు. అందు పంచ మహాయజ్ఞములు ప్రధానమైనవి. అవి సామాజిక జీవనమును విశేషించి గృహస్థ జీవనమును సుఖ ప్రదము జేయును. ఉదయ సాయం సంధ్యా సమయములలో పరమేశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనములు, స్వాధ్యాయము బ్రహ్మయజ్ఞ మనబడును. ఉదయ సాయం సమయములలో జేయు నిత్యాగ్ని హోత్రమును దేవయజ్ఞ మందురు. జీవిత తల్లిదండ్రులకు సేవా శుశ్రూషలు జేయుట పితృయజ్ఞ మగును. తన నాశ్రయించి ఉన్న సేవకులకు, పశు పక్ష్యాదులకు ఆహార మిడుట బలివైశ్వదేవ యజ్ఞ మగును. తిథి వారములు లేక లోక సంచారము చేయుచు ధర్మోపదేశము చేయు అతిథులను, సాదు సన్యాసులను ఆదరించి, సత్కరించి ధర్మోపదేశము పొందుట అతిథియజ్ఞ మనబడును. ఇవి ఏ దేశమందు చక్కగా పాలింప బడునో ఆ దేశము సామాజిక ఉన్నతిని సాధించును.

ఇవియే గాక రాష్ట్రోన్నతికి రాజసూయము, అశ్వమేధము, గోమేధము మొదలగు యజ్ఞముల వర్ణన బ్రాహ్మణ, అరణ్యక గ్రంథ ములలో కాన నగును. వీటి వలన సకాల వర్ష, వాత, ఆతపములతో మానవ జీవితము సుఖ ప్రదము, దేశము సుభిక్షితము అగును. విద్వాంసుల, కళాకారుల ఆదర సత్కారములు జరుగును.

సంపద ఏకత్రితము గాక వితరితమై ఆర్థిక సంకటములు రాకుండును. అవసరమును బట్టి ఆ యా విశేష యజ్ఞములు నిర్వహింప బడు చుండ వలెను. అట్టి యజ్ఞ విజ్ఞానము, వాటి ఆచరణ మాతృదేశమును సువాసిత మొనర్చు అరవ సుగుణము.

సా నో భూతస్య భవ్యస్య పత్నీ: పై సుగుణములతో అలరారు మాతృభూమి వర్తమానము నందే గాక భూతకాలము నందును దేశ వాసులను పాలించి పోషించినది. భవిష్యత్తు నందును చక్కగా పాలించి పోషించగలదు.

ఉరుం లోకం పృథివీ నః కృణోతు : ఆ మాతృభూమి మాకు ఉత్తమ సంపదల నిచ్చి మా జీవనమును సుఖప్రదము, ఉన్నతము నొనర్చును గాక !

ఇట్టి ఉత్తమ భావములతో ప్రారంభించు పృథివీసూక్తము 63 మంత్రములలో దేశపౌరులు తమ వంతు కృషి యేమి చేయవలెనో, ఎట్టి సంపదలతో మాతృభూమిని అలరించి సేవించ వలయునో వివరించును.

తన కర్తవ్యపాలన జేసి ఉత్తమరాష్ట్ర నిర్మాణము చేసిన రాజు లేక నాయకుడు సగర్వముగ యిట్లు ప్రకటించ వలెనని వేద సందేశము--

సంశితం మ ఇదం బ్రహ్మ సంశితం వీర్యం బలం ।
సంశితం క్షత్రమజరమస్తు జిష్ణుర్యేషా మస్మి పురోహితః ॥
(అథర్వ 3-19-1)

"మా దేశ బ్రాహ్మ (విజ్ఞాన) శక్తిని అన్ని సంకటములను ఎదుర్కొని ఉన్నత మార్గమున నడిపించుటకు సిద్ధము జేసితిని. మా సైనికశక్తిని బల వీర్యములతో ఎంతటి శత్రువునైనా ఎదుర్కొన సిద్ధము జేసితిని. మా క్షాత్ర శక్తి ముసలితన మెరుగని నిత్య యౌవనముతో శోభిల్లు చున్నది. అట్టి మా దేశమునకు జయ శీలుడనైన నేను పురోహితుడను - నాయకుడను."

ఇట్టి పురోహితుడు వన గుప్త గోపురములలో పూజలు చేయు పురోహితుడు కాడు. పురము-నగరము-రాష్ట్రము యొక్క హితము చేయువాడు. అతడు రాష్ట్రమునకు నాయకుడు లేదా రాష్ట్రపతి యగును. ఎంతటి ఆదర్శ భావన, ఇందు ఆత్మస్తుతికన్న కర్తవ్యమే ప్రస్ఫుటముగా భాసించు చున్నది. ఈ సూక్తములోని మిగిలిన యేడు మంత్రములు ఇదే భావనను వ్యక్త పరచును. ఈ మంత్రములను రాష్ట్ర హితముకొఱకు నాయకులందరు మననము చేయదగును. ఇట్టి రాష్ట్రీయ భావనలు వేదమునందు కోకొల్లలు. ఇవి భారతీయులే కాదు. ఏ దేశ వాసులైనను మననము చేయదగినవి

## వైదిక రాష్ట్రగీతము

నేడు మన స్వతంత్ర భారతదేశమునకు ఒక రాష్ట్రీయ గీతము కలదు. అది "జనగణ మన అధి నాయక జయహే! భారత భాగ్య విధాతా!.... .... .... .... ...." ఈ గీతము మన దేశము ఆంగ్లేయుల పాలనసత్వములో నున్నప్పుడు విక్టోరియా మహారాణి పట్టాభిషేక సమయమున విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ వ్రాసి సమర్పించినది భారతదేశములోని ముఖ్య పర్వతముల నదుల పేర్లతో, భారతీయ భాషల సమ్మిశ్రిత పదములతో, తన పాండిత్యప్రతిభతో శ్రావ్యముగా పాడుకొనునట్లు ఈ గీతమును రచించెను. ఈ గీతము యొక్క ఉద్దేశ్యము ఇట్టి సస్యశ్యామల దేశమునకు అధినాయకిగా విక్టోరియారాణిని కీర్తించుటయే. కాని, ఆంగ్ల మానస పుత్రులైన నాయకులకు దీనిని మార్పుచేయవలె నను ఆలోచనయే తలెత్తకుండుట శోచనీయము.

వేదము యెంతటి మహత్తర రాష్ట్రగీతమును మన కందించు చున్నదో చూడుడు—.

ఓ.మ్ ఆబ్రహ్మన్ బ్రాహ్మణో బ్రహ్మవర్చసీ జాయతామ్
ఆ రాష్ట్రే రాజన్యః శూర ఇషవ్యోఽతి వ్యాధీ మహారథో జాయతామ్
దోగ్ధ్రీ ధేను ర్వోఢానడ్వానాశుః సప్తిః పురన్ధిర్యోషా జిష్ణూ రథేష్ఠాః
సభేయో యువాఽస్య యజమానస్య వీరో జాయతామ్
నికామే నికామే నః పర్జన్యో వర్షతు ఫలవత్యో న ఓషధయః
పచ్యన్తాం యోగక్షేమో నః కల్పతామ్ ॥ (యజు. 22.22)

బ్రహ్మన్ = ఓ పరమేశ్వరా !
రాష్ట్రే = మా రాష్ట్రమునందు
బ్రహ్మవర్చసీ బ్రాహ్మణః = వేదవిద్వాంసులు, ఉపాసకులునైన బ్రాహ్మణులు

ఆ జాయతామ్ = దేశమంతట ఉద్భవింతురు గాక !
శూరః ఇషవ్యః = శూర వీరులు, బాణవిద్యా నిపుణులు
అతివ్యాధీ = వ్యాధి రహితులు, పూర్ణ ఆరోగ్యవంతులు
మహారథః = గొప్ప రథికులు నైన
రాజన్యః = క్షత్రియులు
జాయతామ్ = అంతట ఉద్భవింతురు గాక !
ధేనుః దోగ్ధ్రీ = గోవులు దుగ్ధపూర్ణము లగును గాక !
అనడ్వాన్ వోఢా = ఎడ్లు భారవాహక సామర్థ్యముతో శోభిల్లును గాక !

సప్తిః ఆశుః = అశ్వములు శీఘ్రగాము లగునుగాక !
యోషాః పురంధిః = స్త్రీలు గృహసామ్రాజ్ఞులై ప్రజలను చక్కగా పోషింతురు గాక !

రథేష్ఠాః జిష్ణుః = రథ సారథులు సదా జయశీలు రగుదురు గాక,
అస్య యజమానస్య = ఈ రాష్ట్రనాయకునికి
యువా సభేయః వీరః = పూర్ణ యువావస్థను బొందు
సభ్యులైన వీరపుత్రులు-అనుచరులు
ఆ జాయతామ్ = కలుగుదురు గాక !
నికామే నికామే నః = మేము కోరినపుడెల్ల
పర్జన్యో వర్షతు = మేఘములు వర్షించును గాక !
నః ఓషధయః = మా అన్న ఆహారాదుల నొసగు ఓషధులు
ఫలవత్యః పచ్యంతామ్ = ఫల పుష్ప సంభరితము లగును గాక !
యోగ క్షేమో నః కల్పతామ్ = అప్రాప్య ప్రాప్తిరూప యోగము,
ప్రాప్తి రక్షణరూప క్షేమము—
సమస్త అవసరముల ప్రాప్తి, నాటి రక్షణ
మాకు పూర్ణముగా లభించును గాక !

ఎంతటి ఉదాత్త భావన ! ఎంతటి మహోన్నత భావన ! ఇట్టి రాష్ట్రియప్రార్థన ఏ మత గ్రంథమునందు కానవగును ? ఈ గీతము భారతీయులకే పరిమితము కాదు. ఇందు ఏ దేశ నామము కానరాదు. ఏ దేశ వాసులైనా నిస్సంకోచముగా చేసికొనుటకు అనువైన ప్రార్థన. భాష కూడా సర్వభాషా జనని వైదిక భాష. దీనిని మన రాష్ట్ర గీతముగా చేసికొన ఉద్యమింతము రండు రాష్ట్రదేవత నర్చించ మనవంతు కృషిని చేయుదము రండు.

శమ్ ఇతి ఓమ్

# అనన్య దేశభక్తుడు



స్వామి దయానంద సరస్వతి

ప్రియ పాఠకులారా !

ఈ 'జనని-జన్మభూమి' చదివిన మీకు జనని జన్మభూముల విలువ కొంత అవగతమైయుండును. ఆ రెంటికి ఎంతో ఋణపడి యున్నామనియు, ఆ ఋణము తీర్చుకొన శక్తికొలది ప్రయత్నించా లనియు ప్రేరణ కలిగి యుండును. ఈ మా ప్రయత్నము చాలా స్వల్పము మాత్రమే. వేదాలలో ఈ విషయము మరెంతయో శ్లాఘించ బడినది. ఆధునిక వేద భాష్యకర్త యైన మహర్షి దయానందుడు ప్రాచీన ఋషి మునుల పంథా ననుసరించుచు వేదములకు కొంతవరకు భాష్యము వ్రాసిరి. వేదాలలో ప్రవేశము కలుగుటకు — ఋగ్వేదాది భాష్యభూమిక, సత్యార్థ ప్రకాశము, ఆర్యాభి వినయము సంస్కారవిధి మొదలగు అనేక గ్రంథములు వ్రాసిరి. ఆ గ్రంథములలో సందర్భము వచ్చినపుడెల్ల 'అఖండ ఆర్య చక్రవర్తి రాజ్యము' కొరకు పరమేశ్వరుని ప్రార్థించిరి. వివరముగా తెలిసికొనగోరు పాఠకులు వాటిని చదువ గోరెదము.

—ప్రకాశకులు